# భక్తకబీర్

[ఆఱంకముల నాటకము]

గ్రంథకర్త:

కొడాలి

సత్యనారాయణరావుగారు.



ప్రకాశకుఁడు:

కురుకూరి సుబ్బారావు,

బుక్ సెల్లర్ అండ్ పబ్లిషరు,

భీమడోలు, అండ్ బెజవాడ.





కాకినాడ: స్కేప్ అండు కో., లో
కె. సుబ్బారాయసోదరులచే ముద్రితము.

1928.

 వెల రు 1-0-0.

ఆంధ్రనాటకములు.

పోతుకూచి సుబ్బయ్యగారిచే
రచియింపఁబడినవి.

శ్రీకృష్ణ తులాభారము 1 0

కావ్యకళానిధి పిశుపాటి చిదంబర
శాస్త్రిగారిచే రచియింపఁబడినవి

శ్రీరామాంజనేయము 1 0
శ్రీకృష్ణ తులాభారము 0 12
శ్రీకృష్ణసందేశము 0 12

విచిత్రాష్టావధాని విద్వత్కవి
నాటకచక్రవర్తి బిరుదాంకితులగు
మల్లాది అచ్యుతరామశాస్త్రిగారి
చే రచియింపఁబడి బెజవాడ మైల
వరం కంపెనీవారిచే ప్రదర్శిం
పఁబడు

ద్రౌపదీ వస్త్రాపహరణం 1 0
అహల్య 1 4

శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రి
గారిచే రచియింపఁబడి

మైలవరం కంపెనీవారిచే ప్రదర్శిం
పఁబడు సావిత్రి 1 0

కీర్తిశేషులైన సోమరాజు అచ్యుత
రావుగారిచే రచియింపఁబడి మైల
వరం కంపెనీవారిచే ప్రదర్శింపఁబడు
పత్నీ ప్రతాప్ అనసూయ 1 0

ఆంధ్రనాటకములు.

శ్రీయుత, సోమరాజు రామాను
జరావుగారిచే రచియింపఁబడి రం
గూన్ మొదలగు పట్టణములం
దనేకసార్లు ప్రదర్శింపఁబడి ప్రఖ్యా
తివడసిన నాటకములు.

ప్రతాపరుద్రీయము 1 4
కాళిదాసు 1 4
గంగావతరణము పార్వతీగ
ర్వభంగము 1 4
తాజ్‌మహల్ జహానారా 1 4
సంపూర్ణ భీష్మచరిత్ర 1 4
ధరణికోట రెడ్డివీరుల సంగ్రా
మము 1 4
అలీబాబా 40దొంగలు 0 12
సతీఅనసూయ 1 0
దానవీరకర్ణ 1 0
కాలకేతనము 1 0
పద్మవ్యూహము 1 0
సంగీతసావిత్రి 0 12
సంగీతప్రహ్లాద 0 12
శకుంతల 0 12
ద్రౌపదీవస్త్రాపహరణం 0 12
శ్రీకృష్ణరాయబారం 0 13
చింతామణి 1 0
సత్యహరిశ్చంద్ర 0 12
శ్రీరామజననము 0 8

# భక్తకబీర్

గ్రంథకర్త.

శ్రీ సంపూర్ణరామాయణ, పాదుకాపట్టాభిషేక, తులసీదాసు,
శారద, నాటకేత్యాది బహునాటక గ్రంథకర్తలును,
సుప్రసిద్ధనటకులును నగు

## కొడాలి సత్యనారాయణరావుగారు.

ప్రకాశకులు.

## కురుకూరి సుబ్బారావు.

బుక్ సెల్లర్, అండ్ పబ్లిషరు,
భీమక్రోలు అండ్ బెజవాడ.




కాకినాడ కె. సుబ్బారాయ సోదరులచే స్కేప్ అండ్ కో., లో
ముద్రితము.

1928.

 [వెల రు 1—0—0

# కృతిసమర్పణము.

శా. దేశారాధకుఁ డైయనారతము ధ । శ్రీ జగ్గాధీమంతుఁడౌ
కాశీనాథుని వంశసోముని యశ । స్స్వామున్ దయాశీలునా
గేశారాధ్యుని నాథుఁ జేసితి నినా । యీనాటకన్ బాండురం
గేశుం డిచ్చిన యాజ్ఞచేత మది నెం । తే సంతసంబందుచున్.

ఇట్లు
గ్రంథకర్త.

ఈనాటకము నాయనుమతి లేనిదే పరిదర్శించినచో నానష్టమునకుఁ బాత్రులగుదురు.

ఇట్లు,
గ్రంథకర్త.

# ఈ నాటకమునందువచ్చు పాత్రలు.

పురుషులు.

1 సూత్రధారుఁడు
2 కమాలు
3 కబీరు
4 వృద్ధబ్రాహ్మణుఁడు
5 రామయ్య
6 మల్లయ్యశాస్త్రి
7 రామానందుఁడు
8 శిష్యుఁడు
9 ఖా[illegible]
10 కేశవుఁడు
11 గణపతి
12 రోహిదాసు
13 విఘ్నేశ్వరుఁడు
14 సూర్యుఁడు
15 బ్రహ్మ
16 శివుఁడు
17 విష్ణుమూర్తి
18 బైరాగి
19 బాలుఁడు
20 కమాలు
21 వర్తకుఁడు
22 కొత్వాలు
23 భటుఁడు
24 పాదుషా
25 సేవకుఁడు

స్త్రీలు.

1 సరస్వతి
2 పార్వతి
3 సుందరాదేవి

[ఇంకను సందర్భానుసారముగ బైరాగులు, భటులు మున్నగువారలు వత్తురు. పాత్రలెన్నియున్నను పండ్రెండుగురితో నీ నాటకమును బ్రదర్శింపఁదగును.]

శ్రీరామచంద్ర.

# భక్తకబీర్.

---

## నాంది.

మ. సతతంబున్ హరిదివ్యనామమధురనా । సక్తిన్ బ్రవర్తించి, య
ద్భుతకష్టంబులఁ జెంది యెట్టులొ చి । ద్రూపంబు వీక్షించి,సం
తతభక్తప్రముఖులైనవారలకు నా । ధారంబుఁ గల్పించి, కీ
ర్తిఁ గైకొన్న "కబీరు" నేలిన ధర । శ్రీనాథుఁ డేలున్ మమున్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

ఓ విద్వజ్జన మహాజనులారా!

ఉ. "భక్తకబీర్" చరిత్రము శు । భప్రదమంచుఁ దలంచుచున్ యథా
శక్తిరచించి వాణికి నొ । సంగి ఋణంబును దీర్చుకొంగ నా
సక్తిని వ్రాసె నొక్కఁడతి । సంతసముప్పతిలంగ నాస మా
శక్తికొలంది నాడెదము । సద్గుణులార! యనుగ్రహింపరే!

(చెవియొగ్గి) ఏమనుచున్నారు? అంతటి యాసక్తితో వ్రాసిన యాతఁ డెవ్వరనియేనా? ఆతురత వలదు. విన్నవించుకొనియెదను.

ఉ. గాయన గాయనీజన ॥ గణ్యనుతు లందఁ దలంచి యిట్టి పా
రాయణయోగ్యమౌ కథను । రమ్యతరంబుగ నాంధ్రభాషలో
శ్రీయుతుఁడై కొడాలికుల । శేఖరుఁడై దనరారు సత్యనా
రాయణ శర్మ వ్రాసెను ది । రంబగు భక్తిని జూపు వాంఛచేన్.

కాలహరణం బేల? సెలవొసంగినఁ బోయి నాటకప్రారంభమునకై నటులను పాత్రల నాయత్త పఱుపం జనియెద.

(నిష్క్రమించును.)

మఱియు—

గీ. చోరులతివిస్తరిల్లిన । కారణమున
బాలునెడ నాకుఁ జాలగా । భయముపుట్టె
సొమ్ముపోయినఁగాని యా । తుంట్రిజాతి
ప్రాణములఁదీతురేమొ వే । గువాఁడ నిపుడు.

నయభయంబుల నెన్నిమాఱులో చెప్పిచూచితినిగాని వినఁడు.

గీ. దేవుఁడూరేఁగుచుండిన । దివ్యకథలఁ
జెప్పుకొనుచున్న భజనలఁ । జేయుచున్న
సుంతసందడి వినుపించు । సంతఁ జెవులు
గోసికొని పర్వులెత్తు భ । క్తులనువోలె.

(అటుపిమ్మటఁజూచి) అదుగో; వచ్చుచున్నట్టులున్నాఁడు:- చప్పుడు వినవచ్చుచున్నది. (ఇంచుక నిలిచి మరల వినుట నభినయించి) రామనామసంకీర్తనము చేసికొనుచునే వచ్చుచున్నాఁడు—

[తెరలో]

కీర్తన— రాగంపూరికల్యాణి— తాళం— రూపకము.

శ్రీరమేశు మదిని దలచి-చింత జేయువారికన్న।
ఘోరపంకములడఁగుచునోడఁ-గూడుదును సౌఖ్యములిలలో॥ శ్రీ॥

కబీరు (ప్రవేశించి) దాసధర్మకలితులగుచు ను-దారబుద్ధిజూపువారిని।
మోసకఁదానాదరించి-మహిని బతితులుగను జేయఁడా?
అనాధరక్షకుఁడగుచును-ముని సంసేవ్యుండగుచును
దనుజ అంతకుఁడగుచును సతతంబును సద్ధులనుబ్రోచు॥ శ్రీ॥

తమా— బాలకా! అదియేమి? అట్లుంటివి? నీయొడలిస్వస్థ సరిలేదా?

వస్త్రంబులేవి ? ఈవికారరూప మెట్టులువచ్చినది? ఈ గోచీ
పెట్టుకొనుటయేమి?

కబీ—(మాటాడకుండును.)

తమా—తనయా? మాటలాడవేమి ?

గీ. కురులునున్నఁగదువ్వి సిం । ధురపుబొట్టుఁ
బెట్టి సరిగంచు వస్త్రముల్ । గట్టఁబెట్టి
నిలువఁగల నగలనుబెట్టి । విడిచిపెట్టి
నిష్కృతాకారమునఁ గాను । పింతువేల?

కబీ—(పలుకకుండును.)

తమా—కుమారా! నిరుత్తరుఁడవై యిట్టులఁ దెల్లబోయి చూచెద
వేమి ?

గీ. దస్యుగణము భీతిఁగల్పించి । దారిమధ్య
మందు దొంగిలినారొ? దు । ర్మార్గులగుమ
న్నహితులు లాగికొనినారొ । చెప్పుమయ్య!
చూచెదనువారిపసల రా । జునకుఁ దెల్పి.

కబీ—తండ్రి! అట్టుల జరుగలేదు.

తమా—మఱి యేమైనది ?

కబీ—జనకా! ఆగ్రహమూని దండించెదనని యూరకుంటిని గాని
నేఱేమియులేదు. వినుఁడు.

గీ. సారమొకయింతలేదు భూ । షణములందు
వస్త్రములయందు నిహలోక । వాంఛలందు

మోక్షసామ్రాజ్యపదవిని । బొందువారి
కిట్టి యందంబులవేల యం । చెదఁదలంచి.

గీ. కలుగునలువల నగలను । స్నేహితులకుఁ
బంచిపెట్టితి దానపూ । ర్వకముగను
మాపతి కటాక్షముండఁగ । మాకిఁవేల?
పరసుఖంబుల వాంఛించు । వారికనుచు.

అట్టి శృంగారవిలాసంబు లిహలోకసౌఖ్యాన్వితులగువారలకుఁ గాని హరినామ సంకీర్తనంబునఁ దన్మయులై భక్తపరాయణులగు వారికేలఁ జెప్పుము. ఇంతియఁగాక.

మ. నరజన్మంబు లభించినందులకు స్వాం । తంబందు నారాయణు సు
స్థిరభక్తి నిల్పి తదన్యచింతలకు న । ర్థింపంగఁబోకే నిరం
తరముత్సాహముతో భజించిన జగ । త్సౌఖ్యంబులందాశలే
క్కారణసిద్ధిగల్గును? మోక్షమేల? యిదిలె । క్కా సేతు శ్రీసాధువుల్

తమా—నాయనా! నీ పసితనంబునందే యిట్టి దైవచింతనమెట్లు గలు
నడిసదోయి?

కబీ—జననా! ఇదికాంత నాశ్చర్యవిషయమేనా? మనవారాచరించఁ దగినవిధులు నిన్నలనిట్టి సత్యగిపకుచుండఁగా వానిని మానవుల వశంబగునే! చూడుఁడు?

గీ. బ్రహ్మసృష్టించునప్పుడే । ఫాలశీలము
పందువ్రాసెను శ్రీహరి । యందుభక్తి
నిలిపి వానిస్మరించిన । నేలఁగలియుఁ
బాపపుంజంబు మోక్షంబు । ప్రాప్తిలునని.

అట్టినియమితవిధుల ననుసరించిన మానవకోటి యమయమలోకంబున

నెట్టి యిడుముల నందుచుండిరో మనము పెద్దలవలన వినుటలేదా? గ్రంథములయందుఁ దిలకించుటలేదా?

శా. ఆఱంపంబులతోడ్చి కోతలు, విష । వ్యాళంబులన్ దెచ్చి శా
రీరంబెల్ల సధీనమున్ సలుపుటల్ । రేదుష్ట! పాపాత్ముఁడా!
రారా! గ్రాగెన తైలమందుమునుఁగన్ । రాయంచుఁ ద్రోయించుటల్
గాఱున్ గూతలఁ గూయుచున్ శిరముప్ర । క్కల్ చేయుటల్ జూడమే.

చూచిచూచి యట్టి యమకూపంబునఁబడి బ్రుంగుట కంటె శ్రీహరి కరుణాకటాక్షమునకుఁ బాత్రులమగుట యుక్తము గదా! తండ్రీ! మఱియొక విజ్ఞప్తి.

గీ. లేదు లేదను వారల । నాదరించి
హరి యొసంగసదాని స । మర్పణంబుఁ
జేయ మనలను హరిదరిఁ । జేర్పఁడో? కో-
మెన కొలుంగిని దిందుల । నేమి కలదు?

సహా.—బాలుఁడవు గదా! ఈ వయస్సున నీకింతటి వైరాగ్యవిషయిక ప్రసంగములతోఁ బనేమి? తెలివి తేటల నుపయోగపఱచి యఖిలవిద్యల నార్జించి మాకింత యాధారభూతుఁడవై సంతోషమును గలుగఁ జేతువను గంపెడాశతో నున్న మాకీ విధిఁ బ్రత్యుత్తర మొసంగుట తగునా? చాలు; చాలు; చీవాట్లు లఁ బెట్టుటకు నోరురాకఁ గొట్టుటకుఁ జేతులురాక నల్లారుముద్దుగాఁ బెంచుకొనుచున్నందులకు నీవు మాయెడల నెంతటి వినయవిధేయతలఁ జూపవలయును? నీవిట్టుల వినయుఁడవై వృథా ప్రసంగి వగుదువని తెలిసియున్నచో నిన్నీ చదువునందుఁ బ్రవేశపెట్టుదునా? సకలవిద్యయందుఁ బ్రవేశపెట్టి నీకధికశ్రమ నొసంగజాలక స్వేచ్ఛగా వదలినందుకుఁ దగిన శాస్తి గావిం

చుచుంటివి. ఇఁక మాకర్మమునకు నిందించుకొనుచు నిన్నుఁ గులవృత్తిలోఁ బ్రవేశపెట్టెదను.

కబీ—తండ్రీ! అంతమాత్రముచేత దైవచింతనమున కభ్యంతర ముండునా?

గీ. గాఢముగు భక్తనిలిపి శ్రీ । కరుని దివ్య
నామపఠనంబొనర్చుచు । నాఁడు మీఁదు
తప్పుచేతలఁ జేయుచుఁ । జెలఁగువాఁడ
దిగులు జెందెదవేల హృ । ష్టమనఁ దండ్రి.

తమా—కుమారా! జీవయాత్రకావశ్యకరములగు పనులనెఱవేర్చుకొనుచు దైవచింతన మొనర్చుకొనుట యుక్తముగాని సర్వకాల సర్వావస్థల యందును యీవిధముగాఁ బాడుచున్న బాగుగా నుండునా? మఱియు?

చ. హరిహరిఁ జెప్పితే యని స । మర్పణముం బొసగింపరాదు సూ?
సిరులను, గల్గ దానిని విశేషముగా । సభివృద్ధిఁ జేయుచున్
గరుణయొకింతఁ గల్గి యిడఁ । గాఁదగుఁ దానముఁ గొంతయున్ సతం
బెఱిఁగిన వేళలందె, యిది । యే పరమార్థమటంచు నమ్ముమా.

కాఁబట్టి మన కులవృత్తియందుఁ బ్రవేశించి నీ నేర్పుఁ జూపుచు గౌరవకీర్తులఁ గాంచుము తండ్రీ!

కబీర్—ఈశ్వరుని కరుణ యున్నంతవఱకు కేపని యొనర్చుచున్నను నాకేమియు బాధ యుండనేరదుగదా! వాని నేమఱకున్న నంతియే చాలు, గాన.

మ. తమయాజ్ఞన్ శిరమందుఁ దాల్చికొని ని । త్యంబేను సద్భక్త రా
త్న్యము జేనన్ ధరియించి రామునృపత్తో । షణ్ దిశా దారింబు నే
మముసన్ నేసెదఁ బట్టువస్త్రములరా । మా! రాఘవా! యంచుదు
ర్గమదుర్గాంత దురంత పంకములు ద । గ్ధంబౌనట్టుల్ వేఁడుచున్ ॥

తండ్రీ! ఒక్కటే మాత్రమున్నది.

గీ. చిత్తమున లగ్న మొనరించి । శ్రీరమేశు
ధ్యాన మొనరింప వారలెం । తైనఁగాని
ఘోరసంసార నారక । కూపమందు
గాలిడఁగ సమ్మతించుట ♦ కల్లగాదె?

జనకా! సారహీనమై, దరిలేనిదైన యీ సంసారమనుమహాసముద్రమునఁబడి కొట్టుకొనువారికి దైవచింతనమునకు మనసు కుదురుట దుర్లభము.

తమా—నీకీవృథా వాదమెందులకు? నీవరుసఁజూడ నొకపరి దండించినఁగాని ప్రయోజన మున్నట్టులఁ గాన్పించుట లేదు. నిన్ను జాలి దలంచిన కొలందియు వ్యాపారమంతయు ముదురుచున్నది. మగ్గంబదిగో! పోయి తొందరగా నందుఁ బ్రవేశింపుము! లేకున్న నాలుక కోసెదను సుమా!

కబీ—తండ్రీ! మంచిది. అట్లనే పోయెదను.

తమా—నేను బజారునకుఁబోయి వచ్చునంతలో నెంతపనిచేయుదువో జాగ్రత్తసుమా? భయభక్తులతోఁ బ్రవర్తింపుము. (నిష్క్రమించును.)

కబీ— కీర్తన—హిం—తోడిరాగం—ఏకతాళం.

రామ నన్నుఁబ్రోవరా । కామితార్థదాయకా
నామనంబున నిన్ను । నే మఱఁ జాలరా॥ రామ॥
రాతినాతిగఁ జేసి । ఖ్యాతినిగాంచిన
నేతవుగావెయో । నీరదశ్యామా॥ రామ॥

(నిష్క్రమించును)

అకటఁ గన్నులులేవా? ఏల గొంతుకఁ జించుకొని వాగెదవు? ఓ జనులారా! ఇది పీతాంబరమఁట చూచితిరా?

గీ॥ గోచికేనియుఁ బనికిరా । కుండనేసి
మోసమున దీని విక్రియ । ముగఁ బొనర్చ
దెచ్చి పీతాంబరమటంచు । నచ్చుసెప్ప
నదరు వీనికి బుద్ధిజె । ప్పంగరాదె॥

కబీ—ఓయీ! బ్రాహ్మణుఁడా!

శా॥ అగ్గిందోసితి వార్యధర్మముల స । త్యంబుఁ విసర్జించి యే
మెగ్గూహింపక, దొంగవై పయిఁగని । ర్లజ్జఁబోరాడెదో
సిగ్గింతేనియులేదు నీకయయొకు । శ్శీలుండ యీతీఱు నే
మెగ్గుల్ సల్పుచునున్న భూసురులకున్ । హీనంబుగాఁదోచదే?

ఓ మహాజనులారా? మీరెల్లరుఁజూచుచున్నారుగదా?

గీ॥ భూసురుఁడితండు నన్నెట్లు । మోసబుచ్చి
శ్రీధరుఁడు దాల్చుఁదగినట్టి । చేలమటుల
మూల్యము నొసంగకయె దొంగ । పోటుగా హ
రించుటయెగాక వదరుఁగా । లించినాఁడె?॥

బ్రాహ్మ—మన యుభయులకీయనవసర వాగ్వాదమేటికి. దాని విలువయేమో తెలుపరాదా? నావలనఁ గైకొనరాదా? ఊరక రాద్ధాంతమొనర్చి నన్ను నిందాపాత్రునిఁ గావించెదవేల? మూల్యము దెల్పినచో విసరి పారవైచెద.

కబీ—ఆహా! యేమి నీత్యాగబుద్ధి.

గీ॥ చించి ముక్కలుగాఁ జేసి । చెలువు గొలుపు
వస్త్రమును బాడు గావించి । వలసినంత

(అని మొలలోనుండితీసి) ఇదిగో! ఇదిగో! మంచిలాభముఁగనితివి!

గీ॥ బట్టయెట్టున్నఁగాని గ । వ్వలను గొంటి
లాగినాఁడవు తాతగా । లంబునాఁటి
నుండి దాచినవవిబాల । కుండ యొంత
గిడుసువాఁడవు నీయమ్మ । కడుపుచలువ॥

(అని ఇచ్చును.)

కబీ—(చిరునగవు నవ్వుచు) అయ్యలారా! చూచితిరా! ఈముదుసలిపాఱుండు నాకిచ్చిన ద్రవ్యమును.

గీ॥ హరిధరింపఁగఁ దగిన సుం । దరదుకూల
మునకు వెలగాఁగనోపఁ । గని ధనంబు
గుడ్డిగవ్వలు కొంటివి । నో గినుంచు
ఋషిని త్యాగంబుఁగొనియాడు । కొట్టుఁజెప్పుడు॥

మఱియు నో మహానీయులారా!

గీ॥ గుడ్డిగవ్వలకొంటి నా । కిట బొసంగి
మంచివెల మంచిలాభమ । టంచుఁ బలికె
నితని వాలకము జూడ । నతిదురాశ
కలుగువాఁడని దోచదే । పలుకుఁడయ్య॥

అమ్మా! విప్రోత్తమా! చాలత్యాగశీలుఁడవు. వీనిని మీరే స్వీకరింపుఁడు. (అని యివ్వఁబోవఁ గ్రిందపడును)

బ్రాహ్మ—ఓరీ దురాత్మకుఁడా! జాతిబుద్ధిపోనిచ్చితివి కాదు. తాత ముత్తాతలనాఁటఁగోతె దాచియుంచిన ద్రవ్యమును నేఁటికియీ పాడుబట్టకొఱకు నీమొగంబునబెట్ట కన్నులకుఁ గావలిమొగ్గట్టి గర్వాంధుఁడవై క్రిందపాఱవేయుదువురా? దురాశాపాతకుఁడనని నన్ను వెక్కిరించిన నీనీతి యేమంత కాలిపోయినది? గురివిందగింజ తన నలుపెఱుఁగదన్నట్లు దురాశాపాతకులెవ్వరో

చక్కఁగాఁ దెలియుచుండ నన్నాశాపరుఁడని నిందించుటకునీకు నోరెట్టుల వచ్చినది? బాలుండవు, కష్టపడినేసి యింతదూరము వచ్చి విక్రయించుచుంటివి. నీకడనుండి తీసికొని రిక్తహస్తములతోఁ బంపుట పాడిగాదని జాలివహించి, యిచ్చిన ద్రవ్యంబు నీగతి బాఱవైచుటకు నీకుఁ జేతులెట్లువచ్చినవి? ఈగుడ్డిగవ్వలవెల నీవేమెఱుంగుదువని ధిక్కరించి యావలఁ బాఱవైచితివి. ఓరీ మూర్ఖుఁడా !

సీ॥ అల కుబేరుని కేని । నవ్వీయఁగల్గుదీ
గుడ్డిగవ్వలతోడఁ । గుత్సితుండ
కనుచుల్కనగఁ ద్రిలో । కముల నేనియుఁగొందు
గుడ్డిగవ్వలతోడ । క్రూరచరిత
దారిద్ర్యమనుమాట । ధ్వంసంబొనర్తు నీ
గుడ్డిగవ్వలతోడ । నడ్డులేక
తలక్రిందుగాఁ జేయుఁ । గలుగుదీ గుడ్డిగ
వ్వలతోడ బ్రహ్మాండ । భాండములను
గీ॥ అట్టి వీనిని లక్ష్యంబు । పెట్టకుండ
బాఱవేతువె మూర్ఖుఁడా । పాపుఁడా మ
దీయశక్తిని నీదుబు । ద్ధిని దలంప
నార యెంతటిగర్వంబు । రా దురాత్మ॥

కబీ—(నవ్వుచు) ఆహా ! యేమినీగుడ్డిగవ్వల మహిమంబు ! నీవు చాల వాగాడంబరముఁ గలవాఁడుగనున్నాఁడవు. ఓయీ మాయబ్రాహ్మణుఁడా!

ఉ॥ ఈ తలతిక్కమాటలకు । నెంతయు లొంగను నీదు తాత ము
త్తాతలనమ్మి యిచ్చినను । ద్రవ్యముచాలదు, పొమ్ముపొమ్ముధా

త్రికాలమందు నెందఱటు । తియ్యనిమాటల మోసపోయిరో
యెంతటి సిగ్గులందిరో గ్రహింపఁగ శక్యమె వేదపారుఁడా॥

(అంత నిరువురు బ్రాహ్మణులు ప్రవేశము.)

రామా—ఓయీ? మల్లయ్యశాస్త్రి! విన్నావటోయీ! వీరి సంభాషణము. గోచిపెట్టుకొనుట కేనియుఁ బనికిరాని యీవస్త్రంబును నమ్మి వేలకొలఁది ద్రవ్యము లాగికొనవలెననియీబాలుఁడును, రెండు గ్రుడ్డిగవ్వలతో సంతృప్తిపరచి పంపవలయునని యీ బ్రాహ్మణుఁడును, వాదములాడుచున్నారు. ఇదియంతయు జూడఁగా.

గీ॥ అంధుఁడును జెవిటివాఁడు నా । ట్యంబుజూచి
సత్ప్రవృద్ధుఁడు బాలుఁడు । నాజనలిపి
నేటిల లంజయుఁ బతివ్రత । యాత్రికరగె
నేటిలగాఁ దోచెడిని మిత్ర । మా! గసంగ॥

మల్లయ్య—అట్లయినచో వీరిరువురితగవునకు మనము న్యాయము చెప్పిపంపిత్తుమా?

రామా—ఇప్పుడు వారి సంభాషణలో మన వాక్యంబులు చెవుల కెక్కునా?

మల్లయ్య—వినెనాసరియె; వినకున్న వారికర్మము. అంతమాత్రముచే నష్టమేమి? ఓ వెఱ్ఱివాండ్రా! ఏల వృథావాగ్వాద మొనర్చుకొందురు? వినుండు. మీసంభాషణ మాలించిన కొలఁదియు మాకు నవ్వు వచ్చుచున్నది.

ఓ కబీరు!

గీ. గోచికేనియుఁ గొఱగాని । గుడ్డనొకటిఁ
బట్టుకొనివచ్చి గ్రుడ్డిగ । వ్వలనొసంగఁ

జాలనని యీసడింతువే । బాలకుండ
గింతకుందగు బొంతయా । గాదచూడ.

కాబట్టి యూరకిపోట్లాడి పరిహాసంబులకుఁ బాలుగాక, యిచ్చినదా నితోఁ దృప్తిపడి యింటికిఁ బొమ్ము.

బ్రాహ్మ—ఓరీ ! మూర్ఖుఁడా ! ఏల చెడగొట్టుకొనియెదవు: ఈగిన్నెల మహిమంబుఁ దెలిపినను దెలిసికొనకున్నావు. ఇప్పుడీలాభసాటిబేరమును బోఁగొట్టుకొంటివా ! ముందు రానున్న లాభము లనేకంబులు చెడిపోవును. పిదప పశ్చాత్తాపపడిన లాభములేదు. నామాటవినుము. ఎవ్వరు తగవు దీర్చినను నీయిష్టకరమైనకన్న నెక్కుడు వెలనొసంగుమని చెప్పెడివారు లేరు.

కబీ—నాపీతాంబర ప్రభావముఁ దెలియక నోరికి వచ్చినట్లెల్ల మాటాడుచున్నావు. హరిహరాదులు కలకరింద్రైనను నావస్త్రంబునకుఁ దగు విలువ నప్పుడనుకి నేను వదలఁజాలను. నీవస్త్రంబుపై నంతదురాశయేల ?

బ్రాహ్మ—ఓయిపిచ్చివాఁడా! ఆవస్త్రముఁబుచ్చుకొని యేలసతాలదిరిగెదవు ? నాగిన్నెలవలన నీకపరిమితలాభమున్నది. చెడగొట్టుకొనకుము. నామాట వింటివా?

గీ. అలుకచేలుంచు భక్తితో । హరికి నట్టుకు
నొసఁగిసిరిసంపదలనంది । యుండలేదె ?
యటులనే గిన్నెలను గొని । యంబరం బొ
సంగితివయేని నీకున్నై । శ్వర్యమబ్బు.

కబీ—అయ్యా ! ఈకల్ల బొల్లిమాటలతో నేమిప్రయోజనము? మీ పలుకులేమియు నా చెవుల కెక్కుటలేదు. కాబట్టి వృధా కాలయాపన మొనర్పక నీదారిని నీవుపొమ్ము. నీకుఁ బదివేలవందనములు.

బ్రాహ్మ—అయ్యా! ఇదియంతయు నెందులకు? నీవలువకుఁ దగినవెల నొసంగు ధనము నాకడలేదు. నీవు దానమూర్తివని పలుసారు లువినియుండుటచే నింతదూరమువచ్చితి.

మరియు.

క. గోపాల బృందావనమున
శ్రీకరుని మహాకీర్తనంబు । జేయుదురంట నే
నాకమనీయునకిది యిడి
జేకొందము ముక్తి యంచుఁ । జెందితివాంఛన్॥

కావున దీనుఁడనగు నామొఱవిని యీ వలువలో నర్ధభాగమునాకొసంగుము.

కబీ—పవిత్రమా! తా మొసఁగునది సత్కార్యమేయైనను నస్వసంతుష్టుఁడనగుటచే మీవాంఛ నెఱవేర్పఁజాలనైతి. క్షమింపుఁడు.

సీ. ఇప్పుడీవస్త్రముదు విక్ర । యించి దీని
విలువ మాతల్లికిడనేని । గలుగు ఫలము
చావుదెబ్బలు చీవాట్లు । చాలయుండుఁ
గాన నన్నుఁ క్షమింపుఁడీ । కరుణఁబూని॥

బ్రాహ్మ—ఓయీ! బాలకా!

సీ. మేఁకలఁ జిగిలితినా? లేక । మాడలడిగి
నానె? భూదానమిమ్మంటి । నా? దయార్ద్ర
చిత్తుఁడనటంచు వినుట నీ । చిన్నగుడ్డ
నడిగితినిగాన దీనికే । లా? భయంబు.

కబీ—అయ్యా! మీకోర్కె స్వల్పమైనదైనను పెద్దల వాక్యంబుల కన్యథాప్రవర్తించుటకు నామనం బంగీకరింపకున్న యదిగదా?

బ్రాహ్మ—ఓయీ! కుమారా! నీవు బాలుఁడవగుటచే భీతిల్లుచున్నాఁ

డవు గాని నేనొక పరమార్థముం జెప్పెదను వినుము. నీ రూపరేఖావిలాసంబులంబట్టి చూడ నీవసాధారణప్రజ్ఞఁగలవాఁడవుగాఁదోఁచుచున్నాఁడవు. కొలఁది దినములలో వారణాసీక్షేత్రంబున నీవు త్యాగధ్వజము నెలకొల్పఁ గలవు. బాలకా! మఱియొక విషయము. దీనిని పరమగోప్యముగానుంచుకొనుఁడు.

చ. తనయులు బంధుగుల్ హితులుఁ । దల్లియుదండ్రియు వెంట రారుచ
చ్చినప్పుడు వెంటవచ్చునది । చూడగధర్మమదొక్కటే సుమీ
గనుకను ధర్మమార్గమునఁ । గానది యేమొ యెఱింగిదానినె
మ్మనమున వీడఁబోకుము కు । మార! సదా జరియింపుమూర్తిగన్.

అఖిల ధర్మమార్గప్రవర్తకుండవైతివా క్రమముగా.

గీ. ధర్మమునుమించినట్టి ప । దార్థమనని
యింకొకటిలేదటంచు గ్ర । హించఁగలవు.

అందునను.

పాత్రాపాత్రత నెఱింగి । బాలకా! యొ
నర్పగానలె సుమ్ము దా । నమ్ము జగతి.

నే నేరహస్యమును నీకుఁ జెప్పక నుపదేశించుటలేదు. నన్ను నీవు సామాన్యమానవునిఁగాఁ దలంచి యిట్టులాడితివిగాని సకలవిద్యాపారంగతుఁడనై సమస్తధర్మంబుల నెఱింగిన వృద్ధబ్రాహ్మణుఁడ నగుటచే నీస్థితిగతులన్నియుఁ జక్కఁగా నెఱింగి వివేకుఁడవనియు, నీతిగలవాఁడవనియు నింతదనుక బోధించితిని. కావున నామాటవిని భగవత్కైంకర్యమునకనియు, నాస్వోపయోగమునకుఁ గాదనియుఁ దలంచి నీమనంబునఁగల సందియంబుల నెల్లవీడి నా కాగుడ్డనొసంగుము. నీకు భయముతో నిమిత్తము లేదు. ముందుముందు నావలననీకు మహోపకారములు చాలజరుగఁ

గలవు. కాశీపురంబున నీవు త్యాగధ్వజమును నిల్పునాఁడు నీవలన నే ననేక బహుమానము లందవలసియున్నది సుమా! వినుము. వినుము. నా వాక్యములు యథార్థములుసుమా?

సఖీ— తెల్లఁబోయి మాటాడక యూరకుండును.

బ్రాహ్మ— బాలకా? ఏమి యోచించుచున్నావు? నాకేలువనొసంగి సచో నీకీర్తి యాచంద్రతారార్కముగ నిలుచును. నాయల్ప కోరికె నెఱవేర్పకుండుట నీకుఁజాల చిన్నతనముసుమా! కుమారా? ఏది; మొగమునెత్తి నావంక నొక్కపరి తేఱిపారఁజూడుము?

మ. తమధర్మంబు లెఱుంగ నేరక యెని । ద్రాహారముల్ బాసి ద్ర
వ్యమె ప్రాణమ్మని నమ్ముకొంచుసతమున్ । పాపాత్ములై పోయిలో
భమునన్ మ్రగ్గినవార లెందఱు వృథా । బాధల్ పడన్ జొచ్చిరో
యమహాపాస నెఱుంగమే? యటులనే । లాసంవరింపన్ వలెన్॥

ఓయీ సత్యవాఁడా! ధర్మమార్గానుష్ఠానపరులై తొల్లి యెందఱు విఖ్యాతిఁగాంచిరో యెఱుంగుదువా? చూడుము. లోకంబులనెల్ల నొక్కపెట్టున భస్మముఁ జేయఁదొడంగిన హాలాహలంబును దేవతల మొఱ విని పరమేశ్వరుం డద్దానిఁ ద్రావి తనధర్మపటుత్వంబుఁ జూపెను. పార్థుని బాహుబలసంపన్నతకచ్చెరువంది తనప్రాణపదమ్ముగఁ గాపాడుకొనుచుండిన పాశుపతాస్త్రంబు నొసంగి ధర్మంబునిలిపెను. విష్ణుదేవుండా కుచేలుని పిడికెడటుకులగ్రహించి సమస్తైశ్వర్యంబుల గట్టిపెట్టెను. ఇటులనే దమయిక్కట్టులను లెక్కపెట్టని ధర్మశీలురఁ బరీక్షించి హరిహరులు వారినిఁగాపాడలేదా? అటులనే భవదీయ కరుణాకటాక్షంబునకు గూడ భగవంతుం డచ్చెరువంది నిన్నుఁ గరుణించఁగలఁడు. కాన లేనిపోని భయంబులఁ బెట్టుకొనక నాగుడ్డ నొసంగుము.

కబీ—(తనలో) ఓహో యేమి వీని యుపన్యాసము ? ఈతం డొక యపూర్వమహిమాన్వితుండు వలెం దోచుచున్నాఁడు. ధర్మమనునే మోచక్కఁగా బోధ జేసినాఁడు ఈతనిసుబోధామృత సేచనంబున బరమలోభులైనను తమకష్టంబుల లక్ష్యపెట్టని త్యాగశీలురగుట నిక్కము. నిజమారయ ధర్మమునకుమించినవస్తువు మఱి యొండుగానరాకున్నది. అతిథిఅభ్యాగతులను, వస్త్రహీనులను వికలాంగులను, నాదరించుటయే మానవధర్మము "శ్రేయాంసి బహువిఘ్నాని" యనునట్లు సత్కార్యములొనర్చుపట్ల నాటంకము లనేకములు వాటిల్లుట సహజంబే యయ్యు వానిని సఱకుఁ గొనక తమ ధర్మంబుల నెఱవేర్చు వారెవ్వరైనను ధన్యాత్ములై ముక్తికన్యను వరించుట సత్యము. దానధర్మపరోపకారాది సద్గుణంబులు లేనివాని కెన్నిసంపదలున్నను నిష్ప్రయోజనములు, నిరర్థకములు, కాన.

గీ॥ తల్లిదూరినఁ గొట్టిన । దరికిఁ జేర
నీయకుండిన లక్ష్యంబుఁ । జేయఁబోను
మోక్షసామ్రాజ్యమును జేరు । మూలమార్గ
బోధకున కిప్పుడే గుడ్డ । ముక్కనిత్తు॥

(ప్రకాశము) దేవా! విప్రోత్తమా! ఇప్పటికిగదా! మీమహిమం బెఱింగితి. కృతార్థుఁడనైతిని. నేఁడెంత సుదినంబు! మహానుభావా! నేనింక భవదీయ బోధనానుగుణ్యంబుగ ననుసరించి యుత్తమ ధర్మపథంబును జేరువాఁడ, పసిప్రాయుఁడనై యజ్ఞానవశంబున నాడిన నాపలుకుల కలుకఁ జెందక మహాత్మా! తమరు కోరిన రీతి యీగుడ్డముక్కను గ్రహింపుఁడు.

"అల్లాహో. బిస్మిల్లా" (అని యివ్వబోవును)

బ్రా—(కోపముతో) ఓరీ దుర్మార్గుఁడా ? ఎంత మోసపోయితినిరా!

వేదబాహ్యమైన దుర్వచనముఁ బ్రయోగించి నన్న పరిశుద్ధపఱచితివఁటరా? ఓరీ కపటశీలా! ఇంతఁదనుక నీ వుత్తమకులసంజాతుఁడవని విశ్వసించితిఁగదరా? పాపీ! నీనుదుట నూర్ధ్వపుండ్రమున్నదని నమ్మి యీపాడుగుడ్డపీలికను వాంఛించితిఁగదరా? దుష్టకులాధముఁడవని యెఱుంగక పాడుమొగమువాఁడవని దెలిసికొనలేక భ్రమించి నన్ను నేనెయెఱుంగనేరక నేఁడు నీవలన మోసపోయితిఁగదరా? ఆహా? నన్ను నిష్కారణముగ మైలపరచితివి. ఉదయంబున లేచి యెవ్వరిపాడుమొగంబుఁ జూచితినో నాకీఘోరపాతకము నీమూలమున సంభవించె. నీగుడ్డ కాలిపోను. ఇది యెవ్వరికిఁ గావలయును, నీమొగమున వేసికొని తగులఁబెట్టుకొమ్ము.

కబీ—దేవా? తామకారణముగ నిట్టులాగ్రహచిత్తులయ్యెద రేల? తమరు వాంఛించిన నీవస్త్రశకలమును తమకొసంగియు మఱల విత్తాపహారమునకుఁ బాల్పడుదునని దలంచితిరా? మహాత్మా! నన్నుఁ గరుణించి దీని గ్రహించవేఁడెద.

శ్లో॥ ఇంద్రింద్వ్యక్షు, మమంథపూర్వ్యముదధిం, పంచాననం పద్మజం
సింధుంస్వాదుజలం, సితంశివగళం, లక్ష్మీ పతేః పింగళం
శైలాన్పక్షధరాన్హ్యయానపితథా, కామంచసద్విగ్రహం
సర్వంవేద్మి, నవేద్మ్యహంరఘుపతే, దత్తాపునర్హారిణం॥

అని వచియించిన పెద్దల వాక్యంబుల నిరర్థకపరతునా? మహాత్మా!

బ్రా—ఛీ॥ ఛీ॥ పాతకుఁడా! మఱల నా సంగతి నెత్తకుము. ఊరక చెడిపోఁగలవు. నిన్నుఁ జూచిన పంచమహాపాతకములు సంభవించగలవు: ఇప్పుడు నీవు తాకుటచేఁ గలిగిన పాతకంబునకుఁ బ్రా

యశ్చిత్తముఁ గూడఁ జేసికొనఁదలచివచ్చినది. మహాపాపీ! అవల
నుఁబొమ్ము?

కబీ—భూసురోత్తమా! తమకిది భావ్యముగాదు. నేను మిమ్ము మైలపరి
చితి ననుకారణముచేఁ బ్రాయశ్చిత్త మొనర్చుకొనఁబోవుచు
న్నారుగదా? దీనినిగూడ గ్రహించి యేకముగ బ్రాయశ్చిత్త
మొనర్చుకొందురని వేఁడెద. మదియాపరాధములఁ క్షమించుఁడు

ఉ. దాసునితప్పులన్నియును । దండముతోఁ సరియందు రీగాదె తా
మీసువహించి వస్త్రము గ్రహింపక । యుండుట పాడిగాదు నా
దోసములెల్ల క్షమించి దయ । తోఁ గృతార్థుని జేయుమయ్య యో
భూసురవంద్య! నీచరణ । పూజలొనర్తు సతంబు నాత్మలో॥

బ్రా—ఓయీ! నీవరుసఁజూడఁగా మోటబండవానివలె నున్నది.
పట్టినపట్టునువీడకున్నావు. నాయభిమతానుసారముగఁ బ్రవర్తిం
తువయేని నేనీవస్త్రంబును గైకొందును. లేకున్నచో నాకవస
రములేదు.

కబీ—దేవా! చిత్తమాలాగుననె నడుచుకొనియెదను, దయచేసి
సెలవిండు.

బ్రా—ఓరీ! బాలకా! నేఁజెప్పబోవునది సావధానచిత్తంబున నాలిం
పుము?

సీ. ముఖమునందూర్ధ్వపుండ్రమో । భూతియో ధ
రింపవలయును లేకనీ । రిత్తమోము
నాస్తికులటంచుఁ దెల్పుఁగా । సన్గుమార!
దానినేమరకయ్య హృ । దంతరమున.

గీ. రిత్తమోమున నున్నవా । రికీసతంబు
తత్వశూన్యతయేగల్గు । తథ్యమిద్ది

యూర్ధ్వప్రపంచంబు ముఖమున । సంచనదియె
దేవునిపదారవింద మర్క । దెలియుసుమ్మ.

అంతియెగాక,

శా. ఓరీబాలక ! నీవొసంగినది యే । దుష్కర్మసంబంధు నీ
తారామార్పణమంచు నీయనలె మో । బంబుత్వ సద్భావ సం
సారాంభోనిధి దాట నావయగు ర । త్నాదత్కునామంబునీ
సీరాహాస్యమునర్క బ్రిమత్తుంచవున్నై । యొల్లప్పపున్ మెల్లమా॥

మఱియు నింకొకి పరమార్థము. (అనిపెవిలో నేమియోచెప్పు) సెలింటెఁబోయెదను. నాహితంబులన్నియు నేమరికి పఠింపుము తదను గుణ్యముగి మెలఁగుచుండుము.

కబీ—చిత్తము దేవా ! వందనములు.

(బ్రాహ్మణుఁడు నిష్క్రమించును.)

కబీ—అహా! ఏమియాతని సామర్థ్యము? సగుణనిర్గుణములలో నిర్గుణమే ప్రధానమని బలువు ఘోషించుటయేగాక వేద ప్రామాణిక మైయుండ నీతఁడు సగుణమె ప్రధానమని సహేతుకముగా ని రూపించుచు శ్రీవిష్ణ్వవతారములలో రామావతారము మిగుల గౌరవమైనదని తన్మహిమంబు నెఱింగించి యున్నాఁడు. కాని యీవిషయమునుగూర్చి యెంత తెఱచినను స్వయంకృషి వలన సాధ్యముకాకున్నది. కాన నేమహనీయుని పాదములన్నైనఁ బట్టి శుశ్రూష యొనర్చి యింకను దఱచఁదగినయంశములనెల్లఁ జర్చించి తన్మూలమున ముక్తిమార్గమును గనుఁగొని కృతార్థుఁడ నయ్యెదఁగాక.



# భక్తకబీర్.



## ద్వితీయాంకము.

కబీ—(ప్రవేశించి.)

కీర్తన.

నాదనామక్రియ రాగము-తాళం, రూపకం.

నీమహిమము నెఱుఁగ నేరని యీమూఢాత్మునిపయినెటు

రామా దయజూపెదో పరంధామ రవికులసోమా॥ నీ॥

1. ఈవిధారి ఫకీరువేసము। దేవా నీకని తెలియక

వేవిధముల దూలనాడితి। వేదవేద్య క్షమింపుమయ్యా॥ నీ॥

3. అలవిగించికి శివునకేనియు। నలవిగాని నీదగుమా

యలనేనెటు దెలియనేరుతు। జలధర శ్యామా? రామా॥ నీ॥

దేవా ? సంసార సాగరోత్తారకంబగు భవదీయ నామపఠనంబొ నర్చుకొనుచుఁ దదన్యంబేనియు వాంఛింపక నిహలోకవాంఛలన్నియు ననిత్యంబులని విశ్వసించి భవదీయ కరుణాకటాక్ష వీక్షణంబున కెదురు

కడనైన నీకు నేను దానపూర్వకముగ రెండుమూఁటలు రెండుగుడ్డముక్కలనొసంగుటయా? ఆహా? ఏమి నాసమర్థత! ఏమి నా తెలివితేటలు? సగుణ నిర్గుణ తత్వనిరూపణవాద ప్రతివాదముల కొఱకు మఱియుశక్తిని బరీక్షించు కొఱకు వివిధరూపములఁ దాల్చినపుఁడు మొట్టమొదట నజ్ఞానుండనై నీమహిమంబుఁ దెలిసికొనలేకపోయినను ఫకీరు రూపంబును దాల్చి వచ్చినప్పుడును మాన పడియుండగూడ నీమాయావిలాసంబును గుర్తించనైతిని. ఓడీనన్ముక్తిప్రదాయకా!

గీ. పామరత్వంబుచేత నా । పలికినట్టి
పలుకులెల్ల క్షమించుచు । భవ్యనామ
పఠనమును నెమ్మనంబునఁ । బాయకుండ
జూడుమయ్య జగన్నాటక । సూత్రధారి.

మఱియు నో దేవా! నీయవ్యాజప్రేమ కసాధారణమను మాట లిప్పటికి సదా సార్థకమైనవి.

సీ. బాల్యదశయందు భూషణాం । బరములెల్లఁ
బంచిపెట్టితటంచు కో । పమునహించి
నట్టి నాతండ్రిగారిని । యట్టిమాన్పి
భక్తునింగఁ జేసినావు దే । వా! అనంత.

తదుపరి, విక్రయముచేసి పైకముఁ దెమ్మని చేతికిచ్చి పంపినపీతాంబరమును బ్రాహ్మణ ఫకీరు వేషములతో నన్ను వేషి లాగికొని నాతల్లిచే నన్నుఁగొట్టించి నేను మూర్ఛాగతుఁడనగునంతటి స్థితిలోనుండ నాబాధయంతయు నీవ సహించి నాసిగ్గోపిత్వమును చాటి నాతల్లినిగూడ నీచరణదాసిగా నొనర్చితివి. కాని

దశరథసుతమంత్రం। దైత్యసంహారమంత్రం।
రఘుపతి నిజమంత్రం। రామ రామేతిమంత్రం.

అని స్మరింపుచుందురు. ఓహో. ఏమి మీ జన్మము.

శ్లో॥ జననీ జానకీ సాక్షాజ్జనకో రఘునందనః
లక్ష్మణో మిత్రమస్మాకం కోవిదారః కుతో భయమ్॥
జనకో రామచంద్రో మే జననీ జనకాత్మజా
హనుమత్ప్రముఖాస్సర్వే హరయో మమ బాంధవాః॥

వినుమా సఖీ సంగము చి) ఓరీ దుష్టసంధాయకా? ఏమనుచున్నాఁడవు. వారణాశీ క్షేత్రంబునఁగల విద్వాంసులలోన మిన్నయై సమస్త శాస్త్రంబుల నెఱింగినవాఁడై సర్వసంగపరిత్యాగియై విలసిల్లు రామానందులవారికి శిష్యుండవు గమ్మనుచుంటివా? దేవా! ధన్యోస్మి! ధన్యోస్మి. నేనిప్పుడేపోయి యమ్మహానీయుని పాదపద్మములఁ బట్టి శుశ్రూషనొనర్చి యాతని కృపాపాత్రుండనై మనస్సంబునఁగల సంశయంబులనెల్ల నివృత్తిచేసికొని జీవన్ముక్తిసాధనంబుల నరయుదుఁగాక.

శ్లో॥ కౌసల్యాలసదాలవాల జనితః సీతాలతాలింగితః
సిక్తః పఙ్క్తిరథేన సోదరమహాశాఖాభిరత్యున్నతః।
రక్షస్తీక్ష్ణనిదాఘపాటన పటుచ్ఛాయాభిరానందయ
న్నస్మద్వాంఛితసత్ఫలాని ఫలతు శ్రీరామకల్పద్రుమః॥

(నిష్క్రమించును.)

## ద్వితీయరంగము.

[ ప్రవేశము కబీరు రామానందులు శిష్యుండును. ]

రామా—ఓరీ! హీనకులసంజాతా! వృథాలాపములాడుటవలన నేమి ప్రయోజనము.

కబీ—దేవా! మృషాలాపములాడితినా?

శిష్యు—గురువర్యా! ఈహీనుఁడు నిజముగాఁ గనువెచ్చఁ దారకమంత్రోపదేశము బొందితిననియు, మిమ్ములను విచారించిన నిజానిజములు దెలియగలవనియు నాతో వచియించుచుండఁగనే నేను యొద్దకుఁ దెచ్చి మా సందేహనివృత్తి జేసికొనఁ బిలచితిమి. మాకుఁ జూపని రూపరేఖావిలాసంబులను.

గీ. రామనామంబుద్ధత్తా । వళి మోసంబు
మోపెను దగిలించి మాల ద్రి । ప్పిడిని వ్రేసి
భక్తులను వెక్కిరింప నీ । పాపకంబు
తగునె వీనిక యిట్టి కృ । త్యంబు దేవ.

రామా—ఓరీ! పరమదుర్మార్గుఁడా? ఏమిరా! వ్రేలినావంట. ద్రోహీ! నీకే వేసమేమిరా? నీకులమేమి? వేదబాహ్యంబగు నీచకులంబున జన్మించినందులకుఁ గులగుణములను జూపించుచుంటివిరా? పశుమాంసభక్షకులగు మీకు దైవారాధనము గూడ యలవడునా? ఎంత విపరీతచెయ్దములకుఁ బాల్పడుచుంటివిరా! అరేదుర్మార్గా! నీముఖము పరికించుచున్నకొలఁదియు నామనంబు భగ్గు భగ్గుమని మండుచున్నది. అనృతములాడిన పాతకమేగాక నధికారములేని యీకపటవేసంబునుబూని జగదీశ్వరుని మోసమొనర్చుచున్న నీకు రౌరవాదిఘోరనారకంబు సిద్ధించక పుణ్యగతులు గలుగునురా కలుషాత్ముఁడా! యీపావుకోడే నీకుఁ దీనికిఁదగిన ప్రాయశ్చిత్తమొనర్చునుగాక (అని విసరగాఁ గబీరునకు రక్తము నుదుటనుండి స్రవించును.)

కబీ—(ధైర్యముతో) దేవా! నాకు పావుకోడుదెబ్బ యూరకదగులలేదు. నాజన్మసార్థకమై నేఁటిదినము పవిత్రవంతమైనదగుటచేత

నే యిట్టుల సంభవించినది. నాభవబంధంబులెల్ల పటాపంచలై
నవి. ఇట్టియోగ్యత మఱియొకరికి సంప్రాప్తమైనదా! కరుణామ
యా! తాపత్రయాభీలంబునం బడి కుమిలిపోవువారి నాదరించు
టకై, అరిషడ్వర్గంబులు వర్జింపలేనివారిని సముద్ధరించుటకై,
సంసారసాగరంబునంబడి మునింగిపోవువారిని రక్షించుటకు, నవ
తరించిన శ్రీవిష్ణ్వంశసంభూతుండవు,పరమపావనులైనను, దీనద
యాళులైనను, జగదాధారులైనను, మహనీయులైనను తా
మే. అనంతములై,అసంఖ్యాకములై, వర్ణనాతీతములై విరాజిల్లు
మీజగత్కల్యాణ గుణంబుల వర్ణింప నెవనితరము? ఓహో
దేవా ! ధన్యుండను. ధన్యుండను. మహానుభావా! భవదీయ
పాదుకాఘాత తాడనము నాకు సంతసంబు గలిగించినది. కాని
బాధయే పుట్టదయ్యె. నాండు రహస్యముగ నేను రామమంత్ర
ము గ్రహించినది మీకు కాదనుచున్నను యిప్పుడు ప్రత్యక్షో
పదేశమని విశదపఱచుటకై యీబహుమానము నాకు
లభించినది.

రామా—(లోనలో) ఆహా ! యీ బాలుని మనోధైర్యమెంతని కొని
యాడవచ్చును. (ప్రకాశముగా) ఓరీ దొంగబాలుండా, నేను
నీ కెప్పుడు తారకమంత్రోపదేశ మొనర్చితినో యబద్ధమాడక
తెల్పుము.

కబీ—ఆర్యా! అసత్యమాడవలసిన యవసరమేల? దేవా ! వినుండు.
నేటి ప్రాతఃకాలమున దాము మణికర్ణికాఘట్టమునకువచ్చి
గంగానది యందాప్లవమొనర్ప నుద్యుక్తులై సోపానముల దిగు
చుండ మీపాదంబులు నాశిరంబునకుం దగులగా రామరామ
యంచు నా తారకమంత్రంబును బఠించితిరిగదా ! మహాత్మా!
తమపాదంబులు నాశిరంబున నుండఁగనే యిట్టిపవిత్రమగు జపం

బును పఠించుటయే నాకుపదేశమై నాగురుసంకేతంబుగఁ దెంగి నా భవబంధములు సడలిపోయి నాజన్మతరించి ధన్యతఁ జెందె. ఇంకెన్ని వేలుపదేశమేమి కావలయును. శరణాగతవత్సలా! ఈవిషయ మిప్పుడే మఱచితిరా! ఆధ్యాత్మిక తత్త్వవిద్యానిధులరై, శమదమాది సద్గుణాగరిష్ఠులరై, నిష్కల్మషులరై, నిరవద్యులరై, నిరంజనులరై, దుష్టశిక్షణ శిష్టరక్షకులుగ నవతరించిన పురాణపురుషులకే. తాముకూడ సర్వమెఱింగియుండియు నామసంబును బరీక్షించుట యుక్తంబగునే? భవదీయకృపకుఁ బాత్రుండనై తినన్నిక పవిత్రమగు రామనామతారక మంత్రరహస్యముఁ దమవలన గ్రహించినవాఁడనై యట్లగుటను బట్టియేగదా! ఏమకిట్టిదుర్నింద్యమైన నిలువబడితిని. ఈపాపీయులనిలువును సంతపఱచి దమ చరణకమలముల గొల్చుకొనుచు తారకమంత్రపఠనంబొనర్చుచు కాలంబు గడుపుకొనియెద గానినాకిట్టి మహాపచార మొనర్చిన శ్రమముఁబెట్టుల దీర్చుకొందును స్వామీ.

రామా——ఓయీ బాలకా! ఎంతటి తెంపరమును బన్నితివి! ఆస్థలంబు నెఱింగి యీ యుపదేశంబును బొందుట కెంతకాలమునుండి యీపన్నాగంబు బన్నుచుంటివో గదా! ఎంతగట్టివాఁడవు! ప్రాయమున బాలుండవయ్యు నిట్టి మాయోపాయముల జాల నేర్చుకొంటివే. ఆహా! ఏమి నీమనోదార్ఢ్యత!

కబీ——మహానుభావా! ఇందు నాప్రజ్ఞ యేమున్నది. చూడుఁడు.

సీ. దరిలేని యంభోధి । తలవంచుకొనురీతి
సధికమించెడి మీద । యూరసంబు
భూదేవి దాపెడ । మోముపెట్టుక సిగ్గుఁ
జెందఁజేయు క్షమావి । శేషమహిమ

జన్మమునందే బ్రాహ్మణత్వమును జెందినవాఁ డెంత నీతుచ్ఛుఁడైనను బ్రాహ్మణుం జేయఁగును. కర్మహీనుఁడైన బ్రాహ్మణేతరుఁడు బ్రాహ్మణుఁడగునా? అందునను మతాంతరుఁడగు వానికి తారకమంత్రోపదేశమేల? దొంగయై మాఱువేసంబుఁ బూని భార్గవునియొద్ద విద్దెలగడించిన సూతకులసంభవుండగు కర్ణుండు శాపదగ్ధుఁడు కాలేదా? సకలధర్మశాస్త్రవేత్తలరగు తామే యిట్టి కార్యమునకు బూనుకొనినచో నిర్ధాత్రి యింక నిలుచునే? దేవా! తమ రెఱుంగని రహస్యంబులు లేవు. నల్లకుక్కను దెచ్చి తటాకంబున నెన్ని మాఱులుముంచికడిగినను తెల్లకుక్క యగునా? సర్వసంగపరిత్యాగులరై, బ్రాహ్మణమతోద్ధారకులై, ఆర్యోత్తంసులరైన తమ కిది భావ్యంబగునా? మా మనవినించుక యాలింపుఁడు. పవిత్రతమములగు మనయార్యమతంబులకు కళంక మాపాదించిన వారమగుదుము. బహుజనకంటకంబగు నిట్టియుద్దేశము విసర్జింపవేడు కొందుము. మీఁద మీ చిత్తము.

రామా—(కొంతతడవాలోచించి) ఓయీ! శిష్యుఁడా! మీ యిష్టానుసారమే యాతని నావలకు బంపివుత్తము. (కబీరునుజూచి) నాయనా! కబీరు! నామాటనించుక యాలింపుము?

మ. పరజాతీయుఁడవయ్యు మోసగతి సో । పానంబులన్ జేరి యా
హరిమంత్రంబును నేర్చుకొంటివి సరే । యామంత్రమున్ నీవు చా
లరహస్యంబుగనుంచుకొ మ్మిటను దు । ర్లభ్యంబు నిన్నుంచుటల్
నరభక్తిగృహమందుఁ జేరి పఠియిం । పఁగ బోలునో బాలకా.

నీవిత్రోవను మాత్రము రావలదుసుమీ.

కబీ—దేవా! తమయాజ్ఞానువర్తినై యట్లనే ప్రవర్తించెదను. సెలవు గైకొందును. (నిష్క్రమించును.)

రామ—ఓయీ శిష్యుఁడా! ఈబాలుండు చతుర్వేదసారంబుల గ్రహించిననేరుపరియైనట్లు గానంబడుచున్నాఁడు. అసంఖ్యాకులైనశిష్యులు నాకడ విద్యలనుబడసిరిగాని యీయల్పప్రాయంబునందు నింతకష్టపడి రామతారకమంత్రోపదేశమును బడసినవారెందును గానరాకుండిరి చూడుఁడు.

గీ. పాపఘంబను లొనరించు । వాఁడు బ్రాహ్మ
ణుండు కానేరఁడిల సద్గు । ణుండు బ్రాహ్మ
ణేతరుండైనఁగాని వి । ఖ్యాతచరితుఁ
డనఁగఁజెల్లును నీచుఁడం । చనఁగరాదు.

బ్రాహ్మణశబ్దోత్పత్తియేమి. బ్రహ్మజ్ఞానాత్తు బ్రాహ్మణః యనికదా ! కావున బ్రహ్మజ్ఞానసమార్జించి ముక్తికాంతను నాసక్తితో వరించినవాఁడెవఁడో వాఁడే బ్రాహ్మణుఁడు, వానికి జాతిమతవిచక్షణలతోడం బనిలేదు. సర్వసంగపరిత్యాగు లెప్పుడును దేనికై యెదురుచూచుచుందురో యద్దానికావశ్యకమగు మార్గము రామనామతారకమంత్రోపదేశమేకదా! ఆమార్గమును గ్రహించుటకుఁగాని, యీమంత్రోపదేశానుసార వర్తులగుటకుఁగాని, గుణమును బుద్ధియు ప్రధానంబులుగాని, తదన్యమేమియు నవసరములేదు. తొలిజన్మంబున నొనర్చిన యేస్వల్పలోపముచేతనో యిప్పుడు తురకగా జనించినను బుద్ధివైశద్యమును బట్టి పామరులచేఁ గీర్తింపఁబడుటకుఁ గాక పండితజనరంజకంబుగ వర్తించుచున్నవాఁడు. ఈతని దృఢసంకల్ప మెట్టిదని విచారింపఁగా ?

గీ. వివిధమతములులేవు పృ । థ్వీతలమున
లేనిపోని వివాదముల్ । బైనివైచి
కొనిమతద్వేషముల బెంచు । చుందురేల

మునందు జరుగుచున్న మాయాజాలములఁ బరీక్షించి యుక్తాయుక్తముల గ్రహించినఁగాని నిజతత్త్వము బయలుపడనేరదు. ఈపరమార్థములను గట్టిగా ముష్టినైచుకొనుము. నేనింక భగవద్ధ్యానమొనర్చుకొందును. తదుపరి మఱికొన్ని విషయంబులఁ దెల్పెదను.

శిష్యు—చిత్తము. దేవా! దేవరవారికిఁ గావలసిన సమిధల నేరికొని వత్తుము. (యవనిక జారును.)



# భక్తకబీర్.

## తృతీయాంకము.

ప్రవేశము ఖాజీ, కబీరులు.

ఖాజీ—రహీమునకును, రామునకును, భేదములేదనికదా పలికితివి! ఎట్లు సందర్భమగును చూతుము.

గీ. రాముఁడన రాట్సుతుండు ర । హీమనంగఁ
గోవిదుఁ డవాఙ్మానస । గోచరంబు
నాచు నాద్యంతరహితమై । యలరి నిత్య
మగు పరబ్రహ్మమంచుఁ బ । ల్కాఁడలేద.

అట్టి పరబ్రహ్మమునకును, మానవుఁడగు రామునకు భేదంబు లేదని పలుకుట.

గీ. బోడికవి సానరాతికి । ముడినివేయు
చందముగ నున్నదయ్యా యీ । సరణి వెళితి
మాటలాడిన వినువారి । మానసముల
వెగటుగాఁ దోచకున్నె యో । వెఱ్ఱివాఁడ.

కబీ—అయ్యా! ఖాజీగారూ! మీరుకడు తప్పుదలంచు చున్నారు.

నూహింతు. రాముఁడు మానవుఁడుగాఁడు. తామెవ్వరిని పరబ్రహ్మంబనిదలఁచుచుండిరో వానియొక్క యంశంబునఁ బ్రతిషలించిన యావిష్ణుమూర్తి జగత్కళ్యాణ సంధాయకుండగుటచే దనసహజ ధర్మ ప్రతిష్ఠాపనలకొఱకు నొక్కొక్క యుగమందొక్కొక్క యవతారమూర్తియై జనించి,

గీ. ఘోరకర్మల కొడిగట్టి । సూరిజనుల
బాధపెట్టెడు రాక్షస । వంశనాశ
మును బొనర్చిధరాభార । మును సడంచు
చుండువానికి విధియాచు । నుండునెప్పు...

అందుచే

గీ. రావణుఁడొనర్చునట్టి దు । రంతములకు
తాళఁగాలేక దేవతల్ । గోలబెట్ట
రాఘవుఁడొకండుఁబుట్టి యా । రాక్షసాధ
ముని వధించుట విధికృత । ముంబొనర్చె.

ఆ రహస్యమును గుర్తింపఁజాలని పామరులు రాముని సామాన్యమానవుఁడని తలంతురుగాని అదియునుగూడ నాపరబ్రహ్మము యొక్క యవతారమేయని గుర్తింతురుగాక.

ఖాజీ—ఔరా! గౌరవమింతేని లేని కాఫరులమతములోఁ బ్రవేశించి పరబ్రహ్మమునకును మానవునకును భేదములేదని యెంతచక్కఁగా సమర్థించుచుంటివి! ఇట్టి మృషాలాపములాడి, యేల భగవంతుని సముఖమున నుత్తరవాది వయ్యెదవు? ఈవెట్టి మొట్టిసిద్ధాంతముల విశ్వసింపక మన పూర్వమతసాంప్రదాయములనే గమనించి ప్రవర్తింపుము. ఊరక యేల చెడి పోయెదవు.

కబీ—అయ్యా! ఖాజీగారూ? నిరాకారమగు పరబ్రహ్మమే ప్రధాన మైన దైవమై యున్నను సత్ప్రతిఫలమగు విష్ణుమూర్తియే యీసకల ప్రపంచమునకు నిర్గుణకర్త యగుటం జేసి.

గీ. ఆదినుండియు ననుజులా । హరినె గొల్చు
చుండి దాసానుదాసులై । యుంటఁ జూచి
యోర్వఁజాలక కొందఱు । పూర్వపక్ష
వాదమును జేయుచుండ్రి ని । ర్భయముగాను.

అందు ముఖ్యకారకు లీమధ్యఁ దలయెత్తిన యిబ్రహిం మొద లయిన దురహంకార ప్రమత్త హృదయులే కదా? మఱియు.

గీ. తొలి విరించికి వేదచ । తుష్టయంబు
బోధనొనరించె యుపదేశ । పూర్వకముగ
విష్ణు దేవుండు సదియె యీ । విశ్వమందుఁ
బరగును ప్రమాణములుగాఁగ । భాగ్యవశతః.

అట్టి సందర్భమునందు,

గీ. మొన్న మొన్న మహమ్మదక్ । ముసలమాను
కల్పనమొనర్చ వ్రాసిన । గ్రంథమెట్టు
లనని కాధారభూతమై । యలరునయ్య
వేదమైయుండె మాత్రాన । వెలయునొక్కొ.

ఖాజీ—ఓరీ! అసంబద్ధ ప్రలాపీ! పరమపావనమూర్తియైన మహమ్మదును ధిక్కరించుచు నాతని వచనంబు లసత్యంబులని నిరూపణజేయ మొదలుపెట్టుచున్నాఁడవు. క్షణకాల మోపికపట్టుము? నీకావరంబడఁగునట్లు చేసెదను. మహమ్మదు పయిగంబరునకు దేవదూతలు భగవదనుమతి ననుసరించి కొనివచ్చిన వచనంబులే యనృతంబు లనుచుంటివిగా? నీగుడ్లు పీకించి నీనాలుకఁ గోయించి మహమ్మదీయమతంబునకు నీవలనఁ గలిగిన కళంకమును బాపం దోలెదనుగాక!

కబీ—కోపమే ప్రధానముగాఁ గలిగి యుక్తాయుక్త విచారణశూన్యుం డవైన నీతో వాగ్వాదమును బెంచుకొనుచు నాయమూల్యమైన కాలమును వృథపుచ్చుకొను చున్నందులకు నాకు నేనే బుద్ధిచె ప్పుకొనియెదను లే? మీరింక దయచేయుఁడు.

భాగ—నేను క్రోధస్వభావుఁడనని యూరక వాపోవుకంటె వాదమొ నర్చి విష్ణుమూర్తి రాక్షససంహారణార్థము మానవజన్మ మెత్తుట చే నెట్టులు ప్రయోజకుఁ డయ్యెనో తెలుపరాదా?

కబీ—ఇందుకిది యూనీకుఁ దెలిసినది? విష్ణుమూర్తి మానవుండయిన కార ణంబుఁ దెల్పెద నాకర్ణింపుము. దానవనాయకుండగు రావణుం డు దేవతలు మొదలైనవారివల్ల మరణంబులేకుండునట్లు ఘోర తపంబొనర్చి వరంబులఁ బడసె. సృష్టికర్తయు, వరప్రదాతయును నుచ్చరించి వచనంబుల కన్యథావర్తించుట న్యాయంబుగాకుం డవిష్ణుమూర్తి మానవరూపంబెత్తెనుగాని మఱియొండుగాదు. అద్దాన దోషంబును లేదు.

భాగ—బాలకా! లోకకల్యాణమునకై సంకణము గట్టుకొనినవాఁడు సంహారణాది పాపకార్యంబులకుఁ బూనుకొని యిట్టి వికారగు ణంబులఁ దెలుపునా యని కనుగొనఁ గాఁబోలు.

కబీ—అట్లుగాదు.

సీ. నేరములొనర్చువాని దం । డించు మనష్టి
రాజునకుఁ బోలులోకదు । రంతకులను గె
డపి ధరాభారమును దీర్చు । టయె విధాయ
కంబగుట నట్లు జేసెనో । భాగిగారు.

భాగ—సరే, విష్ణుమూర్తి త్రిమూర్త్యాత్మకుండందురుకదా? త్రిమూ

త్తులను నల్లరాళ్ళచేఁ జెక్కించి పూజించుట తెలివితక్కువ గదా ?

కబీ—కానేరదు. సర్వాంతర్యామియైన భగవంతుఁడు శిలాఫలకముల యందుఁగూడ నుండుటయే యందులకుఁ గారణము. దైవసంభూతమైన రాళ్ళనుబూజించుట హైందవధర్మంబగుటచే నట్లొనర్చుటలో దోష మింతేనియు లేదుగాని తెలివితక్కువయని వెక్కిరించుట మాత్రము తెలివితక్కువయె. అంతియగాక దైవపూజ ద్వివిధంబు. బహిశ్చక్షువులతో వెలుపలఁబూజించుట మొదటిదియగును. అంతశ్చక్షువులతో లోపలఁగనుఁగొనుట రెండవదియగును. అందు మొదటిది.

గీ. చదువు సంధ్యలులేక నీ । శ్వరునియందు
చిత్తమును లగ్న మొనరించ । చేనలేక
నంధకారంబనెడి కూప । మందుఁ జిక్కి
దారిఁగానంగ లేనట్టి । వారికనువు.

రెండవది?

గీ. చిత్తశుద్ధిగావించి । బల్మికల్గి
సంతతధ్యాన చిత్తులై । సర్వాకార
ఖండయిన యీశు భజియించు । చుండి పరమ
ముదమును వహించు వారికి । మూలసిద్ధి.

ఖాజీ—మీ వేదమునం దాది పురుషుం డెవ్వఁడని చెప్పఁబడినది ?

కబీ—గీ. బ్రహ్మమూలాన మనువును । వానివలన
మనుజులును నుద్భవంబందె । ననివచింపఁ
బడియె వేదంబునందు దే । వా! యిదే ప్ర
మాణమని నమ్ముచుందురు । మనుజులిలను॥

ఖాజీ—దాని నిదర్శనమేమి ?

కబీ—నిదర్శనమా?

గీ. మనువుసంతతి యగుటనే । మనుజులనఁగ
పేరువచ్చెను వారికా । ధారభూత
మైన నీతిమనుస్మృతి । యగుటవలన
వ్యవహరింతురు మనునీతి । యనుచు జగతి
నిప్పటికిని నార్యులద్దాని । నెల్లఘనతో॥

అంతకన్న నాధారమేమి కావలయును.

ఖాజీ—నరక మోక్షము లెట్టివియో చెప్పఁగలవా ?

కబీ— జననమందుటే నరకము.
జన్మనాశనమే మోక్షము.

ఖాజీ—చాల బాగున్నది. నీవు వచించిన దానిఁబట్టి నాకు మరణించిన వారు మరల జన్మమందెదరను సారాంశము దేలుచున్నది. పిదికిన పాలు మఱలఁ బొదుగులోనికి బోవుటయెందైనఁగని విని యుంటివా ? సెబాస్. సెబాస్. చాలు. చాలు. నీవాదము.

కబీ—పరమాత్ముని మాయావిలాసంబులు సరిగా గుర్తింపనేరనియజ్ఞులిట్టులనే వెఱ్ఱివాదనల ప్రక్రమింతురు. సంకల్ప, వికల్ప, సుషుప్తి, జనన, మరణ, దేహయోగ, దేహవియోగ, జగదుదయ, జగద్విలయాది విషయంబులఁగూర్చి మహమ్మదీయ గ్రంథమునం దెచ్చటనేని విమర్శించియున్నదా ?

ఖాజీ—మా గ్రంథమునం దేమున్నదో ఆగొడవయంతయు మీకెందులకు ? జీవుండు మరణించినమీఁదట పునర్జన్మమందుట మాత్రము విరుద్ధమని గట్టిగఁ జెప్పఁగలను.

కబీ—ఇప్పుడు జీవునకు పునర్జన్మ మున్నదని తెల్పుటలేదు. శరీరమునకే యున్నదని చెప్పుచున్నాఁడను. వారివారి కర్మముల ననుసరించి పంచభూతాత్మకంబగు శరీరమేర్పడునని వచించుచున్నాఁడను.

ఖాజీ—వారివారి కర్మల ననుసరించి నరకమునకుఁగాని మోక్షమునకుఁగాని బోవువారికి మఱల విమోచనముండునా?

కబీ—ఏమీ! మీ గ్రంథములలో విమోచనము లేనట్లుల వ్రాయఁబడినదా?

ఖాజీ—లేదు. విమోచనము లేదు.

కబీ—ఇది చాల వింతగా నున్నది. చోరునకును హంతకునకును నొక్కటియే శిక్షయా? శిక్షలకుఁ గాలనియమములేదా? నేరములకుఁ జిన్న పెద్ద విచక్షణములేదా? నేరస్థులకు శిక్షానంతరము విమోచనము గలుగుటలేదా?

ఖాజీ—అట్టుల విమోచనపద్ధతి యుండుట దోషమె యని మా మతము.

సీ. పాపకృత్యంబు లొనరించు । వారు సర్వ
కాలములయం దధోగతిఁ । పాలఁబడుదు
రా మహమ్మదు మతనియ । మంబు పాపి
సద్గతులనందుటన్న నా । శ్చర్యమగుఁ.

కబీ—మానవులై జన్మించి ధరాచక్రంబేలు రాజులే నేరములను బట్టి శిక్ష విధించుచు వారిని బంధవిముక్తులుగాఁ జేయుచుండ గరుణాళుఁడై శాంతహృదయుఁడైన పరమాత్మ మానవకోటిని విముక్తులుగాఁ జేయక నెల్లకాలము నధోగతిలో నుంచునన్న నమ్ముటకవకాశముఁగలదా? ఇది యెంతైన నన్యాయము విష

యమా ! అట్టి క్రూరస్వభావమే భగవంతుని కున్న యెడల నిరీశ్వరులకే యీయుగ మంతరించియుండును. అనుదినంబును యీ పుట్టుటయేమి ! గిట్టుటేమి? గారడివానిచేతఁగల లాంతరులోనిబొమ్మలు మాఱినట్టుల మానవకోటిరూపములను వారి కర్మల ననుసరించి మార్చుచుఁ బుట్టించుచు గిట్టించుచుండును. అట్లుఁ జేయకున్నచో నీ యుగపరిభావమింతదనుక సాగదని యే విశ్వసింపుఁడు. అయ్యా ఖాజీగారూ ! మీవిషయమించుక మనవిఁ జేసెదను. శాంతభావంబున నాలింపుఁడు. తప్పులున్న క్షమించి దిద్దుకొనుఁడు.

గీ. విగ్రహంబుల నిర్మించి । విక్రయించు
కొనుచు దా విగ్రహారాధ । కుం డగుచు ప్ర
బోధ మొనరించె విగ్రహ । రాధనము ప్ర
ధానమని పయిగంబరు । తండ్రితొల్లి.

గీ. ఇబ్రహింపయి గంబరీ । యిలను బుట్టి
తండ్రితోఁ బ్రతిఘటించి యు । క్తంబుగాదు
విగ్రహారాధనం బన । విని స్వదేశ
తెల్లరాతని పురినుండి । వెడలఁగొట్టె.

అట్లు వెడలఁగొట్టిన నిమ్మటఁ బ్రాణములఁ దక్కించుకొనుటకొక దేశమునకుఁ బాఱిపోయి తన స్వధర్మంబులను, తననీతిని, మఱచి దురాలంభుఁడై ఆ దేశపు రాజకుమార్తెయగు నజరాయను నామెను దొంగతనముగా లేవఁదీసికొని యింకొక దేశమునకుఁ బాఱిపోయి యా కాంతతోఁ దృప్తినొందలేక ఆ దేశపురాజకొమార్తెయగు సారాయను నామెను మోహించి వివాహంబు చేసికొని నిర్దయుఁడై చిన్నభార్య మాటల నాలించి పెద్దభార్యను, సింధుజాలాలిని, నిర్దోషిని, అజరాను ఘోరాటవులకుఁ బాఱదోలి నచట ప్రసవించి సుఖముగా నున్న

వార్త విని సారాతో నొనర్చిన పరిమాణమును వర్జించి మఱలఁ బెఱ భార్యతోఁ గలిసికొనిన యీ నేరద్వయమునకే గదా కేశఖండన, చర్మఖండనములను ఘోరశిక్షలు సంప్రాప్తమైనవి ?

సీ. అబరాపిప్రియ కుమారుఁ । డైన యిస్మాయిలును
సారాకుమారుఁ డి । సాక్కు చెప్పి
వారలై తమతండ్రి । వరుస బాగుగ లేద
టంచు వేర్మతముల । యందుఁ జేరి
తండ్రియందున నిరా । దరణఁ జూపనతండు
కష్టించి తనదు మా । ర్గమున ద్రిప్ప
యత్నించి యాశోప । హతుఁడౌటయేగాని
సముద్రపు పాచ్చాయ । సంగిబఱిగె
గీ. వారిచేఁ దఱిమిగొట్టంగఁ । బడి విదేశ
ములకుఁ బరువెత్తి కానసం । బుల వసించి
పశులరీతిని వర్తించు । వారిఁ జేరి
పాతకములకుఁ బ్రోత్సాహ । పఱచలేదె!

తాఁ బెద్దపోశవన మెల్ల జెఱిచెనన్నట్టులనేమియు నెఱుంగనియమాయకుల సోదరులను ప్రోత్సాహపఱచి పాపంబులకుఁ బాల్పఱచి యవివేకమనెడి యగాధమగు కూపంబునఁ బడవైచి మఱల వారు పైకివత్తురను భయముచేఁ దనయిచ్ఛలీల వ్రాసియుంచిన వేదమనుచాపరాతిమూఁత నడ్డంబుగా వైచి పాడుచేసినవాఁడుగదా ? తన పరివర్తనమును తన నీతిని తన ధర్మంబును పదిలపఱచుకొనలేని యీయబ్రాహిం పయిగంబరువాక్కులెంత ప్రామాణికములో చెప్పనక్కఱలేకయే చెప్పుచున్నవి. పోనీ యిస్మాయిలును యిసాక్కును బుద్ధిమంతులుగాఁ దలంతుమందురా వారిలోవారికే మతములోనే యంతర్ద్వేషంబులు పెచ్చుమీఱి త

వులాడఁ జొచ్చిరిగదా ? మామతము గొప్పదని యొకరును, మామత మంతకన్న గొప్పదని వేరొకరును వాదప్రతివాదములాడుకొని తుద కెవ్వరును జయింపఁజాలక వృథాతమకాలమంతయు వ్యర్థపుచ్చి.

గీ. అంత్యకాలంబు ద్వాపర । మైన యంత
మూఢులై శిష్యులుం జేరి । మ్రోలనున్న
వారలకుఁ దమమతప్రభా । వములఁ దెలిపి
తుద కథఃపతితులైరి । గదకసంగ.

ఈ యిస్మాలు యిసాక్కులును బుద్ధిమంతులు వ్రాసినగ్రంథములు సనాతనధర్మావలంబకులు పరిశోధించి వేదబాహ్యమైనట్టియు' లోక వ్యతిరిక్తము లైనట్టియు సంగతులలో నిండియున్నందునగదా సముద్రములో బడవైచిరి ? అయ్యా ఖాజీగారూ! చాటభారతమంతయు నేకరవు పెట్టుచుంటినని యనుకొనకుఁడు. మీ మతమును దూషణ జేయవలయుననిగాని, హిందూమతంబునే యభిమానించుకొని యిట్టి వాదంబును చేయుచుంటినని గాని యాగ్రహము వలదు. కాని యొక్క విషయమును బాగుగా మనంబున నాటించుకొనుటకు గాను వివరించి చెప్పుచున్నాఁడను.

గీ. పరమనిష్ఠను యాపర । బ్రహ్మమెవరో?
ఆదికారణుఁ డెవ్వఁడు । నాదిగ్రంథ
మేది ధర్మములేవి యి । కేది మోక్ష
మార్గమని చేయుమయ్య వి । మర్శనంబు.

ఖాజీ—సరియే; ఈ విమర్శనంబుల కేమిగాని నీ యుపన్యాసమంతయు
బూర్తియైనదా ? ఇంకనున్నదా ?

కబీ—నేను చెప్పునది తమకు విసువుగాఁ దోఁచుచున్నదా ?

ఖాజీ—కానిమ్ము; చెప్పునది పూర్తిగాఁ జెప్పుము.

కబీ—సముద్రములోఁ బాఱవేయఁబడిన గ్రంథములనుగూర్చి యిస్లామ్లి సాక్ష్య పక్షములవా రుభయులును మీగ్రంథములను సముద్రములోఁ బాఱవేయఁబడినవని మీదే పాఱవేయఁబడినదని వాదులాడుకొని పరస్పరతిరస్కారభావమునకు గురియైనందునఁ దుద కుభయభ్రష్టులై యిటు హిందూమతమునకును, అటు మహమ్మదీయమతమునకును జెడిపోవుటచేఁ దుచ్ఛులనియును మ్లేచ్ఛులనియునుఁ బరిగణింపఁబడి యేయితరాధారములేక సగణ్యములయందుఁ గటకటలఁబడుచుఁదుదకు యిస్లాము మతమువారలజరాయున్న స్థలమునకుఁబోయి యాస్థలమునకు మక్కా-యను నామంబిడి దానినే పుణ్యక్షేత్రముగా నెంచుకొని యచటనే నిలిచిపోయిరి. అయ్యా ఖాజీగారూ!

గీ. పిమ్మట జనించినట్టి మ । హమ్మదపుడు
గ్రంథమొక్కండుఁ గల్పించి । ప్రాణులెల్ల
వేసుమీ విశ్వసింపుఁడీ । వేఱువేద
మనని లేదని చాటెన । యతఁడుగాడె.

ఇబ్రహిం పయిగంబరును శాటిమిన సముద్రపు పాచ్యాలచే శిక్షగా నొసంగఁబడిన శిరోముండన చర్మఖండనాదిశిక్షలసదాచారములని గౌరవించి యవలంబించిన మతమేగదా మీది? ఇఁక యిసాక్క-మతములోఁ జేరినవారు తాను దేవుని కుమారుఁడననియు, తన్నునాశ్రయించి నన్నాచరించినవారికే కాని యితరులకుఁ బాపవిముక్తిలేదనియుఁజాటుటచే యమలోకబాధలన్నియు ననుభవించిన యేసు మానవుని సదాచార్యుఁడనియు నాతఁడేగాని వేఱుదేవుండు లేడని విశ్వసించియున్నారుగదా! మీరు ఖాజీయైయుండియు అనాదిసిద్ధములగు వేదప్రమాణముల నుల్లంఘించి నడుమవచ్చిన వానిని విశ్వసించి మూఢులగు వారి తత్పథంబునకుఁ బురిగొల్పుట దోసంబని దలంచెద

(తెరలో)

కొట్టుఁడు, నఱకుఁడు. గ్రుద్దుఁడు. పొడువుఁడు.

(కొందఱు తురకలు ప్రవేశింతురు.)

ఒకఁడు—అరే, కాఫర్, ఏమిరా వాగుచున్నాఁడవు? మహమ్మదుగాక మఱియొక దేవుఁడున్నాఁడనిరా? ప్రేలుదువు. ఏడీ; అట్టిదేవుఁడేయున్నచో మాకుఁ గనుబడరాదా? ఈసమయంబున మీదేవుని మాకగుపఱపకున్నచో నీగతి యేమగునో చూడుము?

కబీ—అయ్యలారా? ఏల తొందర పడియెదరు వినుండు.

చ. వెనుక హిరణ్యకశ్యపుఁడు ప్రేలటయై యిటులే సుపుత్రునిన్
గనసతిదారుణంబయిన గారియలన్ బొనరించి నీదు దే
వునిఁ గనఁజేయుమన్న నడి బోరనఁ గాంభీర్యనసల్ప స్తంభమం
దున విలసిల్లి క్రోధుఁడయి ద్రుంచె వాని క్షణంబులోపలన్.

ఖాజీగారూ! చూచుచున్నారుగదా! వీరల వీరావేశము? సృష్టిస్థితిలయకారణభూతుండగు విష్ణుమూర్తిని వీరిటుఁ జూపవేచుచున్నారు. సర్వవ్యాపియగు సద్దేవుండు లేని తావుఁగలదా? వీరికి పిచ్చిభ్రాంతియేల? నిజముగా సద్దేవుని మహిమంబే వీరికిఁ జూడవాంఛ యున్నయెడలఁ జూపెద నవలోకించెదరుగాక. అని మెడలోని తులసిపూసదీసి మంత్రించగా భయముచేఁ దుఱకలెల్లరు. (పారిపోదురు.)

ఖాజీ—ఔరా! వీనికడ నెంత మంత్రశక్తి యున్నది! వీనితోడ వాదు మాడుట మనదే పొరబాటుగనున్నది. వీనిఁ జేరువకుఁ జేరనిచ్చుట పాముతోడి చెలగాట మాడుటయే. వీనిమైత్రి యెప్పటికేని ముప్పు దేకమానదు. వీనికి దూరముగనే యుండి జాగరూకతతోఁ బ్రవర్తించుట మేలు.

(అని నిష్క్రమించును.)

కబీ—ఆహా! ఈ మహమ్మదీయులందఱు దొమ్మిగావచ్చి నన్నే మో చేయ యత్నించి విఫలమనోరథులగుటయెగాక తులసిపూస మహిమంబున భయభ్రాంతులై కాళ్లకుబుద్ధిచెప్పిరి. ఎంతభీరువులు? ఎంత మనోనిబ్బరము గలవారు? పోనిమ్ము. వీరందఱుమన చేరువగనున్నచో నానిశ్చలభక్తి కనేకవిఘ్నంబులు కల్గించుచుందురు. ఇప్పుడుచాల సుఖపడితిని. నాగృహముచుట్టును చక్కఁగ తులసీవనమును నాటుకొని రామనామ సంస్మరణంబున నా కాలమును వినియోగపఱచుకొందును.

శ్లో॥ రామంకోమలనీల నీరదనిభం నీలాలకాలంకృతం
కట్యాంశోభిత కింకిణీఝుణఝుణధ్వానైరుపేతం శిశుం
కంఠాలంబితరత్ననిర్మలసఖం కంజాక్షమబ్జభవిం
భాస్వంతంమకరాంగదాది వివిధాకల్పంసదాహంభజే

(నిష్క్రమించుచున్నాడు.)



# భక్త కబీర్.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము

(ప్రవేశము కేశవుఁడును గణపతియును)

కేశ—గణపతీ! బహుకాలదర్శనమైనదే! ఎచ్చటను గాన్పించకున్నాఁడవు?

గణ—ఊరిలో జరుగుచున్న చిత్రవిచిత్రములను బరికించు హడావుడులలో నుండుటచేత బొత్తిగాఁ దీఱుఁబడియే లేకున్నదయ్యా!

కేశ—అంత విచిత్రము లేమివచ్చినవి?

గణ—నీవీమధ్య పట్టణములో లేవాయేమి?

కేశ—ఉన్నచో నిన్నడుగుదునా?

గణ—వినుము తెల్పెదను. లేకున్నచో నూరకుందువా! సంపనుబడ్డ కాకివలె రాత్రి రెండుఝాములవఱకు నింటిచుట్టూ తిరిగియేడిపింతువు. మనమంతా రామానందులవారిని దేవుఁడని పూజించుచుంటిమిగదా?

శిష్యులెల్లఁ బనచ్చి ఛీ । ఛీ యెవఁడవు
రా యిదేమి దురంతము । రాయటంచు.

గీ. అట్టహాసంబుఁ జేయుచు । నట్టి సతుల
హుంకృతినినొక్కసారిగ । హుంకరించి
మీగురువు మఠము వీడక । దాగుకొనెనె ?
భయమదేటికి రమ్మని । బంపెఁబిలువ.

ఆ హుంకరింపు విని సింహగర్జనంబునకుఁ జెల్లాచెదరై పాఱు లేళ్లగుంపులవలె శిష్యులెల్లరుఁ బాఱఁజొచ్చిరి.

కేశ—పిమ్మట ?

గణ—వీరలిట్లు పఱువిడుటఁజూచి ఘోరకనాథుఁడు మఱింతయట్టహాసంబొనర్ప రామానందుఁడు చూచి,

చ. గురుఁడని నమ్మియట్టి భుజ । గంబువిధంబున చూటరాక దు
ర్భరముగ భీతిఁగాంచుట య । పాయముఁగాదె వాని గెల్వఁగం
దరపడి శిష్యులార! మన । ధైర్యముఁగూలెను నేటితోడనే
కరణిని నిల్వఁజాలుదు నిఁక । గాన నుపాయముఁదెల్పుఁడీ యనన్.

గీ. శిష్యులప్పుడు దేవ! నీ । చిత్తమెయిగు
ధైర్యమును గోలుపోవ మా । తరముగునొకొ
వానిఁజూచినగుండె ని । బ్బరముఁజచ్చు
మాకుపాయము దోచదో । మానసీయ!

అనుచు వారి మోములవీరును, వీరిమోములవారును, జూచుకొనుచుఁ జెల్లఁబోయియూరకుండిరి. ఘోరకనాథుఁడీదెల్ల గ్రహించి తన ప్రభావమును మఱింత రెట్టించెను. శిష్యులాధాటికి తాళలేక రామానందుని యొంటిగావిడిచి పారిపోయిరి. ఈవృత్తాంతంబాద్యంతంబుగావిన్న కబీరు చింతాక్రాంతచిత్తుండై తత్తరపడి యెత్తరినైన తనగు

రువును రక్షింపఁ గృతనిశ్చయుఁడై చేతిలోనున్న సూలిచుట్టతోడనే గుభాలునఁ బరుగెత్తుకొనివచ్చి మఠములోఁజొచ్చి దీనవదనుఁడై తెఱవుఁగానక ఆచ్చపడియున్న గురువునుగాంచి నమస్కరించి.

ఉ. భీతిలనేల? మీరిటు వి । వేకమునన్ దిగఁద్రావి దేవ! మా
కీ తను విచ్చివేసితిని । యెప్పుడు యేపనిఁ జేయుమన్ననే
నాతటిసిద్ధుఁడన్ గద మ । హాత్ముని తారకమంత్రశక్తి నే
నాతులువన్ జయించెద ద । యామతి నాజ్ఞనొసంగుఁడీవెసన్.

అని వేఁడుకున్నంతఁ గబీరునుజూచి బాలుఁడనియోజించి వానితో శీకొనవలదని యెంతయో బోధించెను. కాని కబీరు వినక.

కం. తృటిలోన నలిమిమైచెదఁ
గుటిలుని ఘోరకునిఁబట్టి । గురువర! యేలా
యిటు పిరికి మందు వోసెదు
పటుతరమగు రామమంత్ర । పఠనంబుండన్.

అని మఱల వేఁడుకొన్నంత రామానందులవారతనిమూర్ఖత్వంబునకుఁ గినిసి యొక్కతన్నుఁ దన్నినంత తనకార్యము మఱింత ఫలించినదని నిర్భీతచేతస్కుఁడై నిలువఁబడి తామేమిచేసినఁ జేయవచ్చును. తమకంతటి పరాభవముఁగలుగఁ జేయ సిద్ధపడియున్న యద్దురాత్ముని నింక విడువఁజాల!

గీ. కంఠగతప్రాణమున్నంత । కాలమేను
అఖిలునివీడఁజాలదే । వా! వినుండు
నన్ను మన్నించి యాజ్ఞ నీ । కున్నదిదియె
ప్రాణములవీడుమని మూర్ఖ । పట్టుబట్టె.

అప్పుడు రామానందుఁడు ఘోరకనాథుఁడసాధారణుఁడనియు లోకములో నతనిజయింపఁజాలు సమర్థులెవ్వరును లేరనియు, నీమూల

మున వారణాసీపురంబునకు నేఁడు నిరయ మానస్నమైనదనియు నయ భయంబుల నెంతదెల్పినను వినక రామానందునకు సమస్కరించిచివాలునఁ బ్రజలసమూహములోనుండి తప్పించుకొనిపోయి ఘోరకుని జూచి ఓరీ! ధూర్తులమారీ!

గీ. జాలవిద్యలనేర్చి వి । శారదులను
మోసపుచ్చుచునుంటి వీ । వేసములిఁకఁ
గట్టిపెట్టుము లేకున్నఁ । గాలయముని
బంచకుఁ జేర్చువాఁడనో । పండఁదప్పుడె.

ఓరీ! ఘోరకుఁడా! నీవంటివారు పదివేలువత్తురుగాక. మదాంధజనగంధసింధుర ఘటావిఘటన ప్రతిభట కంఠీరవాది బిరుదాంకితుఁడగు రామానందులవారిశిష్యుఁడనై యుండియు నిన్నుఁ బ్రాణంబులతోవిడుటకల్ల. నిన్ను నీవెఱుఁగక, నీశక్తినెఱుఁగక, నార్భాటములనెన్నిటినోపలికితివఁట. ఇప్పుడుగదా! నీప్రభావముఁ దెలుపఁదగిన సమయమువచ్చెనని పలికె.

కేశ — అబ్బా! ఆబాలున కెంతధైర్యమున్నదిరా నాయనా! నీవుచెప్పుచుండ నే వినుచున్నందులకే నాకు భీతిగలుగుచున్నదే.

మ. పదసారంబుఁబదేడులైనఁ గలవే? । బాలుండుయేరీతి ని
ల్చెడె నాఘోరకనాథుముందు భయమే । లాలేకపోయెఁ గనఁ
బెడుగై దోఁచుచునున్నవాఁడు భళిరే । విశ్వంబునందిట్టి వీ
రుఁడుగన్పట్టునెయింకొకండు? తలిదం । డ్రులెంతధన్యాత్ములో.

గణ — అప్పుడే గాబరాఁజెందకుము. కథ పూర్తిగావినుము?

కేశ — కానీమఱి?

గణ — కబీరిటులఁ బలికినంత ఘోరకుఁడీతని బాలునిగాఁ దలంచి,

గీ. కనులనిప్పులఁ గురియుచుఁ । గాశినిప్పుడె
భస్మముఁ జేతునంచు నా । ర్భాటములను

కేశ—అందులకుఁ గబీరుఁ డేమనియెను?

గణ—వాఁడు సామాన్యుఁడు కాఁడురా నాయనా: చివాలున లేచి యిట్లనియె.

గీ. నాదుశిష్యుండు ఘోరక । నాథుఁడన్న
వాని కింతటి బోధక । మే? సమస్త
రింగురే యిద్దురాత్ముఁడు । రంతకార్య
ములకుఁ బూనెనె? యిదే వీని । నణఁచెదను.

ఇట్లుఁ బలుకుచునే పోయి తనచేతనున్న పట్టుసూలి మొన నేలమీఁద నంచియుండఁ బైకెగురమీఁటి.

గీ. "జయరమానంద" యనుచును । సత్వరమున
దానిఁగొన కగబ్రాకి య । త్త్రావునంచు
నదురులేకుండఁ బద్మాస । నంబు వేసి
కొనుచుఁ గూర్చుండె నవ్వ్యోమ । మున నతండు.

...దుమఱి యూరకుండెనా?

శా. ఓరీ! ఘోరక! నీప్రభావముఁ జియో । ద్యోమాంతరాళాసన
స్ఫూర్తిరా! వింతఁగఁ జూచుముంటి వికనా । వేరా! దురాత్మా! వృధా
గాలిన్ గూలుదువె? శక్తియున్నయెడ ని । క్కార్యంబునన్ జేసినీ
పేరున్ నిల్పుకొనంగఁ జూచిచనరా । శీఘ్రంబునై ఘోరకా.

అనియె నంత ఘోరకుఁడు లోలోన సిగ్గిలి ప్రతిమాత్రింకు మానసమునను ధరించి యప్పటికిఁ జేయునదేమియు లేక నాలుక నింక కార్య మొనరించెను.

కేశ—అదేమి నాయనా! రవంతఁ దెలియఁ జేయుము!

గణ—ఏమనఁగా! ఘోరనాథుఁడు రామానందుని రూపంబు ధరించి కబీరు ముందట నిలువఁబడియెను.

కేశ—అదెట్లు?

గణ—మంత్రశక్తివలన.

కేశ—కబీరు మాయలోఁబడి యుండును.

గణ—కబీ రంతటి తెలివితక్కువ వాఁడా? చప్పున వానిమాయ గుర్తెఱింగి ఘోరకనాథునిగురువగు మత్స్యేంద్రునిరూపంబు ధరించి వాని యెదుట నిలుచుండె.

కేశ—బలే. బలే.

గణ—ఇప్పుడే చంకలు గొట్టుచున్నావు. కథఁబూర్తిగా విన్నచో సంకమ్మశివాలెత్తును గాఁబోలు. వేపమంపలఁ దేలేక మాదుంప తెగిపోవును.

కేశ—నీపుణ్యము నాయనా! పంబపంబోయని వీఁపుమీఁదఁ బాదకండి. కథశ్రద్ధగావింటాను.

గణ—మరిరస భంగముచేయకు.

కేశ—రసభంగము చేయవలెనని గాదు. కుఱ్ఱవాని గట్టితనము వినుటవలనఁగలిగిన సంతోష పారవశ్యముచేత నొడలు దెలియక యట్లుజేసితిని.

గణ—ఒడలు తెలియుటకే వేషమంత్రప్రయోగ మనియెడి మందు వానికిఁ బెద్ద లేర్పఱచిరి.

కేశ—తరువాత సంగతిఁ జెప్పుమా?

గణ—కథ యెక్కడకువచ్చినది.

కేశ—ఎక్కడకువచ్చినదా! కబీరు మత్స్యేంద్రుని వేషముఁదాల్చి ఘోరకనాథుని ముందు నిలువఁబడినాఁడు. అక్కడకు.

గణ—పిమ్మట ఘోరకనాథుని యోరి కబీరా! నీయిష్టదైవంబగు విష్ణుమూర్తిని నేనేయని శ్రీమన్నారాయణుని రూపంబుధరించె

నంతఁ గబీరు కోపముతో నోరిదురాత్మా! నేనిప్పుడురుద్రావతారమెత్తి పాశుపతాస్త్ర ప్రయోగముచే నీశిరచ్ఛేదనంబుఁ గావింతునని బలుకుచు రుద్రుఁడై యాతని కట్టెదుటనిలువఁబడెను. ఘోరకనాథుండదిచూచి సింహరూపంబెత్తి గర్జింప మొదలుపెట్టఁ గబీరు శరభరూపంబెత్తి విజృంభించుచు నాతనికభిముఖముగా నడువసాగెను. అప్పుడు ఘోరకనాథుఁడు పట్టరాని కోపముతో నలుదిశల నగ్నిఁబ్రజ్వరిల్లఁజేసి చేరువకు నెవ్వరు రాకుండునటుల జ్వాలలఁ బఱపసాగె నంతఁ గబీరాకసంబంతయు మేఘముల తోఁడను,నుఱుములు మెఱుపులతోఁడను నింపి త్రుటికాలము లోపల నఖండమైన వానఁగురిపించి యామంటఁ జల్లార్చెను.

కేశ—ఓహో! చివరకు భారతములోని ఖాండవదహన కథకుఁదెచ్చినావే! నీవు చెప్పెడిదంతయు దానిని బోలియున్నది. ఇంకేమాత్రమున్నది నాయనా? కడుపులో నాకలివేయుచున్నది, కంటికి నిదురవచ్చుచున్నది.

గణ—నాయనా! మనకున్న తలతిక్క యిదేనోయి.

గీ. హరికథలవినెడివేళ, దే । వాలయంబు
లందుభజనసల్పు వే । ళలను మనకు
నిదురరాకుండునే? యతి । మృదువుగాను
జన్మమెత్తినవారికి । సహజ మిద్ది.

అంత రామానందునిశిష్యుఁడైన కబీరుని ఘోరకనాథుఁడు చూచి.

గీ. శరణుశరణని దా నమ । స్కారశతము
లర్పణమొనర్చి తెలియని । యంశములను

గూర్చివినినేర్చికొనియు లగ్గను వహించి
తప్పకొని పాటిపోయె నా ముప్పుఁగడచి.

కేశ—నీవింతవఱకుఁ జెప్పిన కథనుబట్టిచూచిన ఘోరకుఁడేదియో కాలకర్మవశముచేత శరణమనియెనుగాని యాతఁడంతతోఁ గబీరుని విడువఁడని తోఁచుచున్నది. మఱలనేదియో తంత్రింబుఁబన్నకమానఁడు. సరే; వార్తలు చెప్పినావుగాని కబీరు వివాహమని వాడుక నిజమేనా?

గణే—నిజమేకాని కబీరు పరమతావలంబకుఁడై మతభ్రష్టుఁడయ్యె నని స్వమతస్థులందఱు నాపిల్లనన్యమతస్థుని వరియించుట పాడి గాదనియు, వేఱొకని వివాహమాడుమనియు నిర్బంధించుచున్నారు.

కేశ—అందులకాకన్య సమ్మతించినదా?

గణే—ధర్మవ్యతిరిక్తకార్యమునకెట్లు సమ్మతించును.

కేశ—ఇందు ధర్మవ్యతిరిక్తమేమున్నది? మతాచారముల ననుసరించి సున్నతు చేయించుకొనఁడయ్యె. సర్వదా "జయసీతారాం జయసీతారాం" అనుచుఁ గూర్చుండును. పరమతాచారుఁడని స్వజనమున కామాత్రము కష్టముదోఁచుటధర్మవ్యతిరిక్తమా?

గణే—పాపమాకన్య మతాచార సాంప్రదాయముల నాలోచించుట లేదు. భగవంతుఁడా కన్యక తలిదండ్రులకు స్వప్నంబున సాక్షాత్కరించి మీపిల్లను గబీరునకీయకున్నచోఁ వంశక్షయంబగును గానఁ దప్పక నాతనికే యొసంగుమని చెప్పి యంతర్ధానమైన తత్క్షణంబుననే గబీరునకిచ్చుట నిశ్చయించుకొని తమ మనోభిప్రాయమువెల్లడి పఱచిరి. ఆవివరములాకన్యకకుఁ దెలిసె. ఇప్పుడెవరో కొందఱు దానికిఁ బ్రతిఘటించిరని మనోవా

క్యాయకర్మంబుల నాకాంత వరించినవానిని విడచి వేఱొకని వరించుట ధర్మవిరుద్ధంబని యెంచదా?

కేశ—అట్టిగుణవంతురాలి పేరేమిరా నాయనా?

గణే—సుందరాదేవి!

కేశ—వహ్వా! వహ్వా! బహురక్తిగానున్నది. సువర్ణమునకుఁ బరిమళమబ్బినట్టులున్నయది.

గణే—చూడుతమాషా—భగవానుఁడు తొలుతఁ దమాలునకుఁ గనఁబడి ఫలానా పిల్లను కబీరునకిచ్చి వివాహముఁ జేయుమని చెప్పి, పిమ్మట నాకన్య తలిదండ్రులకుఁ జెప్పి, మతాచారములనుగూర్చి వాదప్రతివాదములను బొసఁగించి, తాను ఫకీరు వేషముఁదాల్చి పెద్ద కపటనాటక మాడించుచున్నాఁడు.

కేశ—ఆనాటకమునకు మనముగూఁడ బోయి చూచెదమా?

గణే—దానికభ్యంతర మేమున్నది? ఇట్టి చిత్రవిచిత్రములైనఁ జూచి గాలక్షేపముఁ జేయవచ్చునుగదా? పోవుదమురమ్ము?

(అందఱు నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము.

కబీ—(ప్రవేశించి)

శ్లో. తారంతారక మండలోపరి లసజ్జ్యోతిస్స్ఫురత్తారకా
తీతంతత్త్వమసీతివాక్య మహిమాధారంతటిత్సన్నిభమ్
తత్త్వజ్ఞాన పవిత్రితత్రిభువనం తారాసనాంతర్గతం
తారాంతధ్రువ మండలాబ్జరుచిరం రామంభజేతారకమ్॥

ఓతండ్రీ! రామచంద్రమూర్తీ! నామనంబును నెన్నితెఱంగుల బరిశోధించుచుంటివి? నీసహజస్వభావమిట్టిదని కనుఁగొనుటకు వశం బగునా?వింతవింతలగు నీచేష్టలును లనంతములైనవిగదాస్వామీ? నీలుభగ

గొందఱిని, నీప్రతికూలురుగఁ గొంతమందినిసృష్టించి వాదప్రతివాములుగల్పించి, భక్తులమనస్థైర్యములను బరిశీలించుచుఁ జిత్రవిచిత్రనాటకంబులాడించు నీవిలాసములు వర్ణనీయములుగదా? ఓహో! నీప్రజ్ఞ లెంతవింతఁ గొల్పుచున్నవి! కాని దేవా! నాయెడల నీవు జూపుచున్న యవ్యాజకరుణ కెంతయుఁ గృతజ్ఞుఁడను. నాయనా! కృపాళూ! జగదాధారా! భవదీయపవిత్రనామసుధారసంబును దనివిదీఱ గ్రోలుచుఁ దదేకదీక్షతోఁ గావించుచున్న నాకార్యంబులేల సాగకుండును? తండ్రీ!-పరమతావలంబకుఁడనని నిరసించి సుందరాదేవిని గూర్చి యెవరెన్ని కుట్రాలోచనల నొనర్చినను నీ ప్రేమచేతనేగదా! సకల సద్గుణరాసియగు సుందరాదేవిని నాకుఁగట్టబెట్టితివి? నిర్దయులై మృగంబులఁబట్టి వధించి భక్షింపవచ్చునను వెఱ్ఱిమొఱ్ఱి సిద్ధాంతముల గల్పించి కంచుమ్రోగినట్లు ప్రతిఘటించి వాదించిన మౌల్వీమున్నగు వారిమనంబులఁ ద్రిప్పివైచి పశువధనాపించినది నీశక్తియేగదా? మదీయజననీజనకులు నన్నొంటిగా డించి చనిపోయినను నేతద్విచారంబు నామనంబునఁ జేరనీయక నింతదనుక ధైర్యముగ నన్ను నిలువఁబెట్టినది నీకరుణయేగదా? ఓపరాత్పరా! నావంటి కించిద్జ్ఞులకొఱకు, నావంటి బాల్యవయస్కులకొఱకు, నావంటి సామాన్యమానవులకొఱకు, నెన్నెన్నిరూపములతోఁ బ్రత్యక్షమైకష్టపడుచుంటివో నాకు స్వానుభవమేగదా! తండ్రీ! లోకంబంతయు నెంతవిపరీతస్థితియందున్నను నీదయాబీజమనునది స్థిరముగనాటుకొని యుండుటను బట్టియేగదా! ప్రతివారి యాటలును సాగిపోవుచున్నవి? సర్వలోకాధారా! నీవొక్కపరి కనులు దెఱచిచూడుము. నీకేమి గోచరంబు కాఁగలదో? వింతమనుజులు, చిత్రవాదములు, రక్తపాతములుఁ. విచిత్రరూపంబులు, స్వార్థపరత్వము, భరింపలేని యాశాపిశాచము. భిన్నభిన్న మతంబులు, అంతులేని కోరికెలు, చెప్పశక్యంబుకాని దురాచా

రములు, చూడ ససహ్యంబగు ఘోరకృత్యంబులు, కన నలవికాని నిర్బంధములు, మితిలేని మతద్వేషంబులు, వివిధములైన వికార రూపములివిమాత్రమే గోచరంబగును. ఈ విపరీతకపటక్రియాపూరితమైయున్న యీకర్మక్షేత్రంబునకు విముక్తియెన్నఁడోగదా? సృష్టిలో భేదములేదయ్యె. మానవనిర్మాణ మొక్కటిగనే గన్పట్టుచున్నప్పుడు భావభేదములేల? పరస్పరాసూయలేల? నీ నిర్హేతుక జాయమాన కరుణాకటాక్ష వీక్షణములొక్కతూరి, దేశబాంధవులయందు, సదాచార సంపన్నులయందు, స్వార్థత్యాగులయందు, భవదీయచరణ భక్తులయందు, శాంతమూర్తులయందు, ఆర్తజనరక్షకులయందు, దీనులయందు, వికలాంగులయందు, బ్రసరింపఁజేసి వారి మనోవేదనము, వారిపరిశ్రమము, వారివాంఛలు గుర్తించి నవంతసేపు నీవు చేయుచేసికొనినచో దుర్భరవిచారమగ్నయై విలపించు భూదేవి కోరిక సార్థకంబగును. దేవా! పుణ్యజనంబు లెంతటి యిడుమ లందుచున్నారో పరికింపుము. ఏకార్యంబుల నియోగించి యీ మానవకోటిని సృష్టించితివో యాకార్యంబులందే వారిమనంబు లగ్నపఱచి, విపరీతావేశములను మాన్పుము. అనంతా! ఉన్మత్తచిత్తుల కీనీచవృత్తులు తగవని హితముఁగఱపుము. జయసీతారాం, జయసీతారాం, (అని కన్నులు మూసికొని వెంటనే తెఱచి) ఓహో! ఏమియీ విలాసము! ఆబాలుండెవ్వఁడు? నాకెదురుగా నిలువఁబడినాఁడు. ఆ బాలునితోఁ గూడ నొక ముదుసలి బైరాగి కూడఁ గలఁడే? ఏదియో పాడుచున్నారు. వినుదునుగాక.

(తెఱలో)

శ్లో. భజగోవిన్దం భజగోవిన్దం
భజగోవిన్దం మూఢమతే

సంప్రాప్తే సన్నిహితే కాలే
నహినహిరక్షతి డుకృఞ్ కరణే.

కబీ—(విని) ఓహో! యేమి? ఓభక్తాగ్రేసరులారా! స్వాగతము నాకర్ణములకుఁ జక్కని యానందము గల్పించితిరి. ఆహా! యేమినృత్యము.

(తెలిలో)

మూఢజహీహి ధనాగమతృష్ణాం
కురుసద్బుద్ధిం మనసివితృష్ణామ్
యల్లభసేనిజ కర్మోపాత్తం
విత్తంతేన వినోదయచిత్తం॥ భ॥

కబీ—ఏమి మాధుర్యములగు కంఠనాదంబులు, అయ్యా! సతత భక్తిపరాయణులారా? యిటుదయచేయుఁడు.

(అంత నాభక్తులు పాడుకొనుచుఁ బ్రవేశము.)

శ్లో. నారీస్తనభరనాభీదేశమ్
దృష్ట్వామాగా మోహావేశమ్
ఏతన్మాంస వసాదివికారం
మనసివిచింతయ వారం వారమ్॥ భ॥

శ్లో॥ నళినీదళగత జలమతితరళమ్
తద్వజ్జీవిత మతిశయచపలమ్
విద్ధివ్యాధ్యభిమానగ్రస్తమ్
లోకంశోకహతంచ సమస్తమ్॥ భ॥

జయ రమారమణగోవిందోహరి—(కబీరు గూడ సనును)

కబీ—మహాత్ములారా! అభివాదనంబులు. ఇటుల దయసేయుఁడు. భక్తులారా! మీ రాకచే నామందిరంబుఁ బవిత్రమయ్యె. నా

పాపంబు లడంగిపోయె. నాజన్మ తరించె, ఆర్యులారా! తమ వాసస్థలమేమో! తమరాకకుఁ గతంబేమో తెలిసికొన ముచ్చట పడుచున్నాఁడను.

భైరా—మా నివాసస్థలము కోసల దేశము. కాశీయాత్ర నొనర్చి పావనగంగయం దాప్లావ మొనర్చి గురుపంకంబు లడంగఁజేసికొని జన్మసార్థక పఱచుకొందమను భ్రాంతిచే నిటకువచ్చి తత్కార్యంబుల నెఱవేర్చుకొని భవదీయవిఖ్యాతనామంబు బలుమాఱులు వినియున్నవారమగుటచే దర్శనంబొనర్చి పోవుదమని యిట వచ్చితిమి.

కబీ—అయ్యలారా! తమవంటి మహానుభావులరు నాయట్టి నిర్భాగ్యుని దర్శనమునకై వచ్చితిమని వచించుట వింతగనున్నది. తత్త్వరహస్యవేదులై, అపార తపోవ్రత వ్యాపారపారీణులరై, శ్రీమన్నారాయణ చరణభజనానందులరై వెలయు మీరేడ? పామరుండనగు నేనేడ?

భైరా—ఓభక్తాగ్రేసరా? అట్లనఁబోకుము. ఏపుట్టలో నే పామున్నదియో యెటులగ్రహించనగును? నీవు నిరంతర భగవత్సేవాపరాయణుండవై యసంఖ్యాకములగు తత్త్వార్థ రహస్యంబుల నేర్చుకొని సంకల్పసిద్ధుఁడవై యుంటివని వినుటంబట్టియేగదా యింతదూరము రాగల్గితిమి? కబీరుగారూ! మీవలన మా కోరిక నొకదాని నెఱవేర్చుకొనవలయునని వచ్చితిమి.

కబీ—ఓహో! ఇదియొకటియా! పరమాశ్చర్యవిషయము. పరమాశ్చర్యవిషయము. నావలననే! దేవా! యేమది.

భైరా—నిరంతరంబును సాధుజనావనుండును, ఆశ్రితవత్సలుండును, శరణాగతవత్సల బిరుదాంకితుఁడునునగు నాపరమేశ్వరుని, ర

ఘుకులస్వామిని, నాకోసలాధీశుని, కౌసల్యాగర్భశుక్తిముక్తా ఫలమును గీర్తించుచు ధ్యానించుచుందురట. కర్ణానందముగ నాలుగు శ్లోకములను తమమృదు మధురకంఠనాదమున మాకు వినిపించి మమ్ము చరితార్థులుగా జేసెదరని మాయాశయము. ఇంతకన్న మేమర్థించునది మఱియొండు లేదు.

కబీ—భక్తులారా! శ్రీరామ ధ్యానశ్లోకములు తామిప్పుడు గాన మొనర్చుకొనుచువచ్చిన తత్వశ్లోకములను వినంచియుండరా?

బైరా—ఓయీ? అట్లుగాదు. శ్రీరామచంద్రుని నిజస్వరూపమును స్వయముగా గనుంగొని తద్రూపవర్ణనమునమునిమగ్నుండవగుట నీజన్మముతో పవిత్రితనొందియున్నది గదా?

కబీ—స్వయముగా నప్పరబ్రహ్మమును గనుంగొనుట నాయట్టివానికేనా లభ్యము? ఆర్యులారా! తమవంటివారు వినందగినంతప్రజ్ఞగల తత్వంబులుగాని, ధ్యానశ్లోకములుగాని జెప్పుకొనినవాండనుగాను.

బైరా—ఓ భక్తుండా! నీయసాధారణమైన ప్రజ్ఞ మేమెఱుంగనిదిగాదు. మేమెవ్వరుగనో భావింపకుము. వినుము.

ఉ. ఈపదునాల్గులోకముల । కెల్ల ప్రభుండయి పాలుబత్తే మే
లోపములేకఁగాంచు దయ । లోఁగొనిభక్తులఁబ్రోచుచుర్ మన
స్తాపములన్ హరించు చని । శంబు యశేమ్మొనఁగూర్చుచుంను ల
క్ష్మీపతి యాతఁడాతని భజించెడు । భక్తుఁడ నారదుండనేన్.

కాఁబట్టి నీగానంబును వినిపోవనెంతయో దూరంబున నుండి వచ్చిన మావాంఛను వృధజేయకుము.

కబీ—ఓ హాహాహా ! నేఁడెట్టి సుదినంబు మహాత్ములారా! అజ్ఞానుఁడనైడ మిమ్ముల గనుగొనసేరని నానేరంబునకు క్షమించుఁడు.

భైరా—ఓయీ! కబీరూ! కొంతతోడ[redacted]డుము. నేను చితారువాయించెదను. ఈదేవుఁడు నృత్యమొనరించును.

కబీ—మహాత్ములారా! ఇంక నాకు భయంబెందులకు! మీకు పాడుకొనుచువచ్చిన గీతికలనే పాడుదము.

శ్లో॥ పునరపిజననం పునరపిమరణమ్
పునరపిజననీ జఠరేశయనమ్
ఇహసంసారే బహుదుస్తారే
కృపయాపారే పాహిమురారే॥ భ॥

శ్లో. యావద్విత్తోపార్జనస
స్తావన్నిజపరివారోరక్తః
పశ్చాజ్జీవతిజర్ఝరదేహే
వార్తాంకోపిన పృచ్ఛతిగేహే॥ భజ॥

శ్లో. యావత్పవనో నివసతిదేహే
తావత్పృచ్ఛతి కుశలంగేహే
గతవతివాయౌ దేహాపాయే
భార్యాబిభ్యతి తస్మిన్కాయే॥ భజ॥

భైరా—బాగు బాగు శ్రీరామధ్యాన శ్లోకముల రెంటిని పాడుము!

కబీ-శ్లో॥ కస్తూరీఘనసారకుంకుమలసచ్ఛ్రీచందనాలంకృతం
కందర్పాధికసుందరంఘననిభం కాకుత్స్థవంశధ్వజమ్
కల్యాణాంబరవేష్టితం కమలయాయుక్తం కళావల్లభమ్
కల్యాణాచలకార్ముకప్రియసఖుం కల్యాణరామంభజే॥

శ్లో॥ రామం రాక్షసవంశనాశనకరం రాకేందుబింబాననం
రక్షోరిం రఘువంశవర్ధనకరం రక్తాధరం రాఘవమ్
రాధాయామాత్మనివాసినం రవినిభం రమ్యం రమానాయకం
రంధ్రాంతర్గతశేషశాయినమహం రామంభజే తారకమ్॥

బైరా—ఓహో! ఏమోయి! నీగానకళానిపుణత్వము.

కబీ—(వినిపించుకొనకయే తన్మయచిత్తంబునఁ బాడఁదొడఁగును.)

కీర్తన - రాగం పూరికళ్యాణి తాళం ఏక!

గాలిబొందిలోఁ - గదలుచున్న తటి

చాలఁగనందఱు - కుశలమనుకుదురు

కాలముదీఱిన - గాలినిలచుతటి

నాలియుభయపక్ష - కళేబరముఁగని

మనసా గోవిందుని - భజింపుమా

ఘనమగు మాంద్యము - విడుముమూర్ఖికి

మనకుఁగాలమా - సన్నంబైనను

మసలకోటులు - రక్షింపరువినుమా॥

జయ రమారమణ గోవిందో హరి!

(చప్పునఁగన్నులు దెఱచి నలుదిశలవీక్షించి)అయ్యో!అయ్యో! ఎంత ఘోరకార్యముల కొడిగట్టినారు? హా! భగవానుఁడా! ఆగోధుమలు తిరుగలిలోఁబోసి పిండిచేయుచున్నారే, ఎంతబాధ నొందుచున్నవో గదా? దయామయా! పరాత్పరా! సంసారచక్రంబున నుఱిన డియున్న నేనును గూడ నిట్లు వినాశమందవలసిన దేనా? ఇందు కేదయిన సాధనముఁ జెప్పి యీ గోధుమలకాబాధ నివారణముఁ జేయ లేవా? హా! చూడఁజాల! చూడఁజాల! చూడఁజాల (అని విచారమున మూర్ఛాగతుఁడగును.)

బైరా—పాపమీతఁడు మూర్ఛాగతుఁడై పడియున్నవాఁడు. కారణ మేమియో తెలియకున్నది. తత్వములను బాడుచుఁ దన్మయత్వమున స్మృతిదప్పి యుండును. ఆహా! ముందీతనికి శీతలోపచారములఁ జేయుట పాడిగదా?

(అనునంతలో తెఱదింపవలెను.)

## తృ తీ య ర ం గ ము.

కబీ— హే పరమేశ్వరా! నాకడనున్న దర్యంబంతయు బూర్తిగా బోయినదని నీ మాయచే వీరలను సృజించి నాకడకుంబుచ్చితివా? అరచేత నరకానేనిలేని దీనదశయందుంటినని యెఱింగియు నీరీతి నొనర్చుట నీదాసుని బరీక్షించుటకే గదా? నిన్ను నమ్మినవారికి దారిద్ర్యమే సాక్షియనుమాట నిక్కమమనిలోక ప్రసిద్ధమే. ఎందులకీ మాయావిలాసములు? చూడుఁ డీవేయిమంది బైరాగులును మా కాహారంబిడి రక్షింపవేని నీ గుమ్మముకడఁజేరి ప్రాణంబుల వీడెదమని ప్రతిఘటించి పలుకుచున్నారు. దీనదయాళూ! అష్టైశ్వర్యములతోఁదులదూగునప్పుడును, దుర్భరదారిద్ర్యము ననుభవించుచున్నప్పుడుఁగూడనీవే యాధారంబని విశ్వసించి నీనామమంత్రపఠనంబునఁ దన్మయుఁడనై జరియించు నన్నీలాటివిషమపరీక్షలఁజేసి యపఖ్యాతిపాలుఁ జేయుట నీకుధర్మమేనా? ఆర్తత్రాణపరాయణా! నా భార్యమెడలోని మంగళసూత్రంబుఁదక్క నన్యమేమియు లేదు. దుర్భరపరాభవము జరుగనున్నది. ఈముప్పుదప్పింపవేని నీబిరుదంబులన్నియువ్యర్థంబులు. నీదాసుఁడనగునాకుఁ గలిగినయగౌరవమున నీవుభాగముఁ బంచుకొనవలసినవాఁడవగుదువు. దాసులను రక్షించుచుండుటవల్లనే దాసపోషకుఁడవైతివి. ఆర్తులమొఱలాలించుటచేతనేయార్తత్రాణపరాయణుఁడవైతివి. దీనులకు శరణ్యుఁడవగుటమూలముననే దీనశరణ్యుఁడవైతివి. ఆబిరుదావళినేల వృథా పాడొనర్తువు?

(తె ఱ లో)

యెయ్యో! ప్రాణములు పోవుచున్నవయ్యా? చేతఁగాకున్నఁ బొమ్మనరాదా?

కబీ—అయ్యలారా! తొందరవలదు. ఆపప్రియత్నముమీఁదనే యున్నాను. మీ రొకముహూర్తకాల మోపికఁ బట్టవలయును, సంతృప్తిగభోజనంబులఁ బెట్టియే పంపుదును. ఆఁకటిబాధచే నంగలార్చుచిమ్ముఁలను వృథాపంపుదునని తలంపఁబోకుఁడు. (తనలో) ఇప్పుడేమిచేయుదును? (ఆలోచించి) చక్కనియూహపొడఁగట్టినది. నాయింటిని గుదువబెట్టియైన వీరలఁ దృప్తిఁబఱచెదఁగాక. దైవమా! నాకోరిక నీడేర్పుము!

శ్లో॥ కస్తూరీతిలకం కపీంద్రహరణం కారుణ్యవారాన్నిధిం
క్షీరాంభోధి సుతాముఖాబ్జమధుపం కళ్యాణసంపన్నిధిమ్
కౌసల్యానయనోత్సుకం కపివరత్రాణం మహాపౌరుషం
కౌమారప్రియ మర్కకోటిసదృశం సీతాసమేతంభజే॥

(నిష్క్రమించును.)

చతుర్థరంగము.

(ప్రవేశము కబీర్ సుందరాదేవి)

కబీ—(మఱలఁ బ్రవేశించి) ప్రేయసీ! భగవానుని యనుగ్రహంబున నెట్టులెట్టులో వేయిమంది వైరాగులకు సంతృప్తిగా భోజనంబిడి పంపివైచితిమిగదా? కాని యిఁక వాగ్దానమును జెల్లించుకొనుటయే తరువాయియున్నది.

సుంధ—నాధా! తమ వాగ్దానమేమి?

కబీ—సుందరీ! ఏమనిచెల్పుదును.

గీ. సరుకునిచ్చెద నీకిష్ట । చాలిసంత
నిల్లుకుదువఁగఁ బెట్టెద । వేల నీదు
భార్యనొకరాత్రి । నిద్రకై పంపుమన్న
పరియెనని మాట నిచ్చితి । వరలతాంగి.

సుంద — (చెవులుమూసికొని) రామ రామ ! నాథా ! ఎంతమాట ? అగ్నిహోత్రుని సాక్షిగా వివాహమాడినకాంతను, దనపతినే ప్రాణమానధనంబులని నమ్మికొని చరించు యువిదను, సదా శ్రీహరినామసంస్మరణచిత్తయగు మానవతిని పరులకడకనుపుటకు మీరెటులసమ్మతించిరి? ధర్మాధర్మంబుల నెఱుఁగక నా మూర్ఖుఁడెట్టుల మిమ్మీరీతి నర్థించెను ? అయ్యో ! ఎంతటి విపరీతము!

చ. పరమపతివ్రతామణికి । భావ్యమె యీగతినాచరించుటల్
పరులెవరైన విన్ననెఱు । వంటి ప్రమాదము సంభవించు, సు
స్థిరమయి నిర్మలంబయిన । దేహము సమ్మతిఁజెందు టెట్టులో
హరి యెటులాదరించు నఁడు । గంటదె కీర్తధరాతలంబునన్.

కబీ — దేవీ ! అటులఁగాదు. వినుము. ఎవ్వరికిద్దానిపై నెట్టివాంఛజనించినను నర్థంతురో అట్టివారికోర్కెలఁ జేతనైనంత దనుకదీర్చుటయే నామతము. అదియుఁగాక నావర్తకుఁడట్టులొనర్చినఁగాని వెచ్చంబులీయనని గట్టిగావక్కాణించె. అందుల కొప్పకుందునా? వేయిమంది సాధువులను బాధించినవాఁడనగుదును. నాబాధకైన నోర్చుకొందును. నీపతివ్రతాధర్మవిరుద్ధకార్యమునకైన నంగీకరింతును. తుదకు మనయందఱిప్రాణంబుల ర్పించుటకేని సంసిద్ధుఁడనగుదు కాని:—

గీ. ధరఁబరోపకారార్థమి । దంశరీర
మనెడి ధర్మంబురిత్తఁ జే । యంగనామ
నంబుసమ్మతిఁజెందునే । యంబుజాక్షీ
వర్తకునికోర్కెఁదీర్పఁ ద । ప్పదయెనేను.

కాఁబట్టి నాయందుభక్తిఁగలదానవేని మదీయాజ్ఞ నాదలధరిం

చినేఁడు దివ్యాంబరభూషణాలంకృతనై సిద్ధముగనున్నవో నాథుఁడవీ తిసదృష్టింపఁజేసికొని యావర్తకునియింట దిగవిడిచివత్తును. చేసినవాగ్దానమన్యథా యొనర్చుటకు నాచిత్తంబంగీకరింపదు. వినుము. తొల్లి రాముఁడు లక్ష్మణుని గుమ్మముకడఁ గావలియుంచి యమునితో సంభాషించుచుండ దుర్వాసులువచ్చి లక్ష్మణుని లెక్కసేయక లోనికిఁబోనుద్యమింప లక్ష్మణుఁడు తనప్రాణములకైనఁ దెగించి దుర్వాసునివిడచె. అట్లురామానుజుఁడు వానిని వదలకున్న సహజకోపియైన దుర్వాసుఁడు ఘోరంబగు శాపంబొసంగకుండునా? పోయినఁ దనయొక్క ప్రాణమె పోవునను మనోధైర్యమేగదా! కాఁబట్టి

గీ. అపకృతిగాక యశంబుఁదో । ష్వకునుగాక
మౌనవంబను నరకంబు । ప్రాప్తమగును
గాక దుర్భరతమమైన । కష్టచయము
పిపఁజాలను నాపట్టు । వీనమేని.

సుంద——(తనలో) పరమేశ్వరా! నాపాతివ్రత్యమంతయు బూదిపాలుగావింపఁ దలంచితివా? దేవా! దీనదయాళూ! ఆవర్తకునకట్టికౄరవాంఛ యేలజనించె! ఇదియంతయు నీమాయవల్లనే గదా జరుగుచున్నది? నాయట్టి యుత్తమకాంత నిట్టియగచాట్లపాలుఁ జేయుట నీకు ధర్మమా! సర్వలోకాధారా! నన్నెట్టివిషమపరీక్ష జేయుచుంటివి?

మ. వెనుకన్ గోయియు ముందు బావియుఁబ్రాప్తించెన్ గదా కష్టముల్
విని యావర్తకునింటికేగితినయే । నిర్మానభంగంబుఁ గ
ల్గును నాపెన్మిటిమాట దప్పిన మహా । ఘోరంపు పాపంబు వ
చ్చును యింకెయ్యదిధర్మమై సలుపవచ్చున్ తోచదయ్యెన్ గటా!

కబీ——సుందరీ! ఏమి యాలోచించుచున్నావు?

సుంద—నాథా! ఏమియులేదు. ఉత్తమపతివ్రతాలలామనై పరుని తో సాంగత్యంబున కెట్లియ్యకొందునా? దైవమా! నాగతి యెంతకుఁ దెచ్చితివని వగచుచున్న దానను.

కవీ—కాంతామణీ! వగచి యేమిప్రయోజనము? మించినదానికి మనమేమి చేయఁగలము? ప్రియసీ! నిజముగా నేనాసమయంబున సందుల కొట్టఁబడకున్నచో నాబైరాగులను సత్కరించి పంపుటకు వీలుకలుగునా? అంతియెగాక నీవిప్పుడు భయపడనేల? చూచుచుము వాని మాహాత్మ్యము. నీకు దగునరీతిని బుద్ధిజెప్పుట యదియొకమంచి మార్గమేగదా యని యందుల కంగీకరించితిఁగాని నీపాతివ్రత్యమునకు భంగము కలుగఁజేయ వలెనని తలంపు నాకు మాత్రము గలదా?

గీ. పాపులనుబట్టి శిక్షింపఁ బైనదండ
ధరుండొకఁడు గలండుగదా సతీ! బు
వేలఁ జింతవహించెదు? బేలవగుచు
లేను! మనపట్ల రాముండు లేకయున్నె?

సుంద—నాథా! మదీయ పాపపుణ్యంబులయందు సమభాగంబును బంచుకొను మీకు మాత్రము మీపాటిఁ దెలియకుండునా! కాని హైందవాంగనల కిదియొక మచ్చయగునేమో యని భయపడుచున్న దానను. పవిత్రవంతమైన యార్యావర్తమునకుఁ గళంకముఁ గూర్చినదాన నగుదునని భీతిల్లుచున్న దానను. కులధర్మంబుల మలినపరచినదాననగుదునని విచారించుచున్న దానను. శ్రీరామ నామసుధారసంబును దనివిఁ దీఱఁ గ్రోలు మీయట్టి పరమభాగవతోత్తమునకు ధర్మపత్నినై యిట్టి ఘోరకృత్యంబునకు సాహసముఁ గట్టుకొనుచు మీకీర్తి నొకగంటుఁ జేసినదానన

గుదునని గుందుచున్నదానను. నా యీ చెడుకార్యంబునకు ఘోరరౌరవంబను నరకకూపంబునం బడి యెన్ని మన్వంతరములు ఘోరశిక్షల బాలుగావలసివచ్చునో యని పరితాపపడుచున్నదానను. ఇన్ని విధములగు నాందోళనములతో నిండియున్న నామనంబునకిది యుత్తమ ధర్మపథమని సమర్థించుకొనలేకుంటిని. దేవా! నిరంతరసాధుజనపోషకులగు మీరు, సంతతసన్మార్గావలంబకులగుమీరు, సతతశ్రీహరినామ సంకీర్తనాపరులగు మీరు, అనవరత ముముక్షుమార్గ సంపాదితాభిలాషులరగు మీరు నాకు విధించినకార్యము గౌరవమైన దే కానిండు; హీనమైన దేకానిండు; హైందవాంగనకుం బతియే దైవముగాన దిరస్కరించంగూడదు. కాన, మీయాజ్ఞానువర్తురాలనై నవ్యభూషణాలంకారశోభితనై, మృదుదుకూలధారిణినై, యీ వర్తకుని పాదసాన్నిధ్యంబున కరిగెద. ఆవంతయేని దోసంబులేక యింతవఱకు మీచరణసేవయే సకలమ్మని భావించు నన్నా వర్తకుండు వీక్షించినతోడనే యాతనిహృదయంబు మాఱునటుల మీదైవభక్తియే నన్ను గాపాడుం గాత. శ్రీరామచంద్రుని పవిత్రనామపఠనమే నన్నుం బాలించుంగాత. నాపతివ్రతాధర్మప్రవర్తనకు, మీవాగ్దత్తమున కెవ్విధిని భంగముగాకుండ నారామభద్రుండోముంగాత! నాథా! ఒకవేళ దైవోపహతురాలనై నన్నావర్తకుండే స్పృశియించుట ఘటస్థించెనేని జగన్మాతయగు సీతాలలామను హరియించిన రావణాసురుండు, పరమపతివ్రతాశిరోమణియగు దమయంతిని మోహించిన కిరాతుండు, ఉత్తమచారిత్రయై పరిభవక్లేశానలంబున మ్రగ్గియున్న ద్రౌపదీదేవిని ముప్పుతిప్పలం బెట్టిన కీచకుండు నేమైరో వానిగతియునట్లేయగుంగాక. రామమూర్తి నాపాలిటనుండండా? జగదభిరాముండు నా జన్మంబుం దొలంగింపండా!

ఇంతదనుక మీచరణసేవజేసిన నాపతిభక్తి నన్నుఁ బాలింప దా! మనల దయామయుండు నిర్నిమిత్తంబుగ నిట్లుల వేధించుచుండెనని దలంపకుఁడు. నాపాతివ్రత్యమునకు భంగము వాటిల్లునని సంశయింపకుఁడు. దేవా! సెలవొసంగిన పోయివచ్చెద. కాలముగూడ సమీపించుచున్నది.

కబీ— దేవీ! ఇప్పుడుగదా నేను ధన్యుండనైతిని. నాకు విచారమేటికి? నాదుదైవంబగు శ్రీరాముండు నాహృదయఫలకంబునఁ జేరి యివ్విధి వాగ్దత్తంబొనర్పంజేసి నీకుఁ బ్రబోధింపజేసి, నిన్ను బంపుచుండఁగా మనకువిచారింప నవసరముండునా? ఇంతకును మానవులేమి? భగవంతుఁడేమి? ఎవ్వరైనను కర్మానుభవమును దాటలేరుగదా! నీవొంటరిగా బోనేల! నిన్నావర్తకునియింటికినరకును సాగనంపియే వచ్చెదను. నడువుము.

శ్లో॥ శత్రుఘ్నో వ్యజనాంకితోపి భరతః పార్శ్వద్వయే పశ్చిమే
ఛత్త్రం చామరసంయుతం కలితవాన్ యం సేవతే లక్ష్మణః
మూలేకల్పతరోర్విమాన విలసన్మాణిక్య సింహాసనే
పద్మాసన్నముని సేవితం రఘుపతిం సీతాసమేతం భజే॥

(నిష్క్రమించుచున్నారు.)

## పంచమరంగము.

(ప్రవేశము-విష్ణుమూర్తి)

సెబాస్, భక్తుఁడన్న కబీరే భక్తుఁడు. మనోధైర్యమునందీతని కెనయగువార లీధరామండలంబునఁ గలరే!

సీ. పితౄర్జితపుఁ గాస్తి । వెచ్చమైపోయి పై
సాలేనినాఁడేని । సణఁగఁబోఁడు
పెన్కుదుసాధువుల్ । వేకలి యన్నముఁ బెట్టు
మంచు వేధింపఁ జ । లించఁబోఁడు

తనభార్యసౌందర్య । మును వర్తకుఁడు గోర
విధికృతంబునకింత । బెదరఁబోకు
దొమ్మిగావచ్చి యా । తురకలు చెలరేగ
దిగులుబొందుచు వెన । దీయఁబోకు

గీ. మతవిషయవాదమునతన । మాటనెట్టు
లేనినెగ్గింప ధైర్యముం । బూని యితఁడు
నాదుమహిమంబుఁ జాటుచు । న్నాఁడు భరత
ఖండమున కీర్తి సద్దెసల్ । గ్రమ్ముకొనఁగ.

ఇట్టి యీకీర్తివంతునకుఁ దగిన యీ సుందరాదేవి పతివ్రతాత్వమహిమ మెంతయుఁ గొనియాడఁ దగినది. ఆహా! ఏమి యిల్లాలు.

సీ. పతిమాట జవదాఁట । సతినకుఁ గతిలేద
టంచు నెంచెడి మహి । తాత్మురాలు
రాత్రింబవళ్ళు శ్రీ । రామ శ్రీరామ యం
చును జపించుచునుండు । యనఘురాలు
సాధులఁ బూజించి । సంతృప్తిగా నన్న
మును బెట్టి పంపించు । పుణ్యురాలు
పనియెంతయున్నఁదా । స్వయముగాఁ జేయుచు
నొడలుదాచని యట్టి । యోగ్యురాలు

గీ. సత్యవాక్యాలనంబె మో । క్షంబు దైవ
భక్తియే శాశ్వతానంద । పదమటంచు
నమ్మిచరియించు నెంతో మో । దమ్ముఁ గూర్చు
యీసతీమణిమించు వా । రిలనుగలరే.

ఎన్నివిధంబులఁ బరిశోధించినను జలింపని వీరి ధైర్యమేమన

వచ్చును? నామహిమచేతే నావర్తకుండు దుర్వాంఛాలంపటుండైనను యమ్మానవతి పాతివ్రత్యమునకు భంగము రాకుండ గాపాడితి. కొత్వాలు వేషంబు ధరించి వర్తకునికి ప్రాయశ్చిత్త మొసర్చితి. ఈదంపతుల కీర్తిచంద్రికలు నలుదిక్కుల విడంబించులాగున బరమభాగవతోత్తముండైన కమాలుదాసుని వీరి గర్భంబునం దుద్భవంబగులాగొనరించితి. పోనిమ్ము. అబ్బాలకుని మనోధైర్యంబునం దేమేని కళంకమున్న దేమో యని బరీక్షించితి గాని నాప్రయత్నంబులే వ్యర్థంబులై పోయె. అతని మహిమాతిశయ మెంతయు నచ్చెరువు గొలుపుచున్నయది.

గీ. విగతజీవుఁడైన । విప్రబాలుని జూచి
గోలి దెమ్మటంచు । గోల పెట్టి
చేయిఁబట్టెలాగ । శీఘ్రమ్ముగా వాఁడు
లేచికూర్చునె నిద్ర । లేచినట్లు.

అట్టి ప్రజ్ఞాన్వితుండగు నబ్బాలకుని కిప్పుడు ద్వాదశవర్షంబులు సమీపించినవి. కాఁబట్టి వీనికి రామనామమంత్రోపదేశ మొనర్చియంతర్ధానుండనై పోయెదఁగాక. అదుగో! కమాలి యీవచ్చుచున్నాఁడు.

(ప్రవేశము-కమాలు.

కీర్తన-ధన్యాసి ఆది.

రామనామకీర్తనకు మించిన ॥ దేమున్నది యిలనో మనసా
నేమముతో రఘురాముని గొలిచిన ॥ బాములుదొలగెడి
నో మనసా॥ రా॥

1. నాదబిందు కళకాధారంబయి । నాణ్యంబయి పరమార్థంబయి యభేదవృత్తి మెలఁగినచో నీకది । విపులంబగుజ్ఞానం బిడును గద॥ రా॥

విష్ణు—బాలకా! నీ వెవ్వరవు?

కమా—అయ్యా! నేనా? కబీరు కుమారుఁడను. కమాలనువాఁడను.

విష్ణు—నీకీ కీర్తన లెవ్వరు నేర్పిరి?

కమా—మాతండ్రిగారే నేర్పిరి.

విష్ణు—ఉపదేశ పూర్వకముగా నేనా?

కమా—లేదు. నిరంతరంబు నాయన పఠించుచుండుటచే నలవడిన కతంబున గానం బొనర్చుచుంటిని.

విష్ణు—ఓయీ! నీవు కడు బుద్ధిమంతుఁడవలెఁ గనఁబడుచున్నాఁడవు. కాన నేనొక పరమార్థ మెఱిఁగింతు విందువా?

కమా—మహాప్రసాదము.

విష్ణు—బాలకా! నీజనకుఁడు శ్రీరామ భక్తుఁడు. నీతల్లి మానవతీ శిరోమణి. అట్టి సుగుణాఢ్యులగర్భంబున బుట్టిన నీజన్మ మతిపవిత్రమైనది. తండ్రిమూలమున గర్మక్షేత్రమునఁ బఱగునియ్యార్యావర్తము ధన్యతఁగాంచినది. కాని, యింక నక్కడక్కడ మతద్వేషంబులు, పరమతానుసారణాది దుర్వాంఛలు, సదాచారవ్యతిరిక్త కార్యాచరణములుగలవు. అట్టివానిని నిర్మూలనమొనర్చి దేశమును సర్వారాభివృద్ధిఁ జేయవలసినభారము నీయందుఁ బెట్టుచుంటిని. నే నెవ్వఁడనని దలంచుచున్నాఁడవో? ముప్పదిమూఁడుకోట్ల దేవతల కధినాథుఁడనై, పదునాలుగు జగంబులఁ బాఱుబత్తెంబుఁ గైకొను విష్ణుమూర్తిని. భక్తులను బరిశోధించుటయు, దుండగీడుల నంతరింపఁ జేయుటయు నావిధి. నీయట్టి సదాచారసంపన్నులనునిమిత్తమాత్రులుగ నియమించి యీధరాచక్రంబును నడిపించుచుందును. నిరంతరమస్మదీయనామపఠనాసక్తులైన నీయట్టి పరమభాగవతశిఖామణుల కప్పుడప్పుడిట్టులనే దర్శనమొసంగి వారి మూలమున లోకమున కుపదేశములఁ జేయించుచుందును. నీజనకుఁడింక

సంసారమున నుండఁబోవు. సకలయాత్రల సేవించును. త్రాగుబోతులను, విటులను, సత్యవిదూరులను, చోరులను, దేశద్రోహులను, మాతృవంచకులను, పటాటోపులను, ఆర్యమతసాంప్రదాయ విరుద్ధప్రవర్తకులను, ఇహలోక సౌఖ్యలోలురను, లోభులను, కసాయిలను, దేవాదాయాపహరణపరాయణులను, జూదరులను, మూర్ఖులను, సదాచారములయందుఁ బ్రవేశపెట్టి భరతమాత విచారమును బోఁగొట్టుటకై బయలువెడలనున్నవాఁడు. నీజనకుఁడున్న సామాన్యుఁడుగాఁడు. వినుము. ఈభారతీయుల మూర్ఖత్వంబునకు వగచుచు దేశమాత కొండొకప్పుడు హిమాచల శృంగంబునఁ జేరి కన్నీరు మున్నీరుగా విలపించుచుండ కిరాతభిల్లీలు ప్రత్యక్షమై శుకులవారు కబీరై మహమ్మదీయమతంబున నుద్భవించి శ్రీరామభక్తుఁడై హిందూ మహమ్మదీయ సమ్మేళన మొనఁగూర్చి దేశదారిద్ర్యమడఁగింపఁ జేయునని చెప్పి యోదార్చి యంతర్ధానమయ్యె. ఆ శుకులవారే మీజనకుఁడు. నీ తండ్రివలన దేశమునకుఁ జాలసేవఁ జేయించవలసియున్నది. నీవు నీతండ్రికిఁ జేదోడువాదోడుగ నుండవలయును. కాని, నీవు నాకొక్క వాగ్దత్తముఁ జేయుము. వివాహమును జేసికొనసని బలుకుము.

కమా—దేవా! వివాహముఁ జేసికొనను:-ఇదే వినుండు.

గీ. అస్ఖలిత బ్రహ్మచారినై । యనవరతము
దేశసేవకుఁ గడఁగినీ । దివ్యనామ
పఠనమునఁగాలమున్ బుచ్చు । వాఁడఁగాని
ఘోరసంసారమునఁజిక్కు । కొనను దేవ.

విష్ణు—ఇప్పుడునీవుఁ జేయఁదగిన కార్యము లనేకములు గలవుసుమా! అందునకు.

గీ. సత్యవాక్పాలనంబును । శాంతి, దాంతి,
ముఖ్యముగనున్నఁగాని నీ । మూలమునఁ బ్రి
పంచమున మానవులు నీతిఁ । గాంచఁబోరు
గాన జాగ్రత్తతోనుండ । గావలయును.

నేనింకఁబోయెద. నేను చేయవలసిన కార్యంబు లనేకములు గలవు. తొలుదొల్త నీతండ్రిని సంసారమునుండి తొలఁగించి నీశక్తికి గాన్పడి విరాగసూత్రంబులఁ దెలిపినఁగాని వీలులేదు. ఈపరమార్థంబులు రహస్యంబుగ నుంచుకొనవలయునుసుమా?

కమా— దేవా! చిత్తము!

(విష్ణువు నిష్క్రమించును.)

కీర్తన-రాగం జంఝూటి, ఆదితాళము.

కమా—

శ్రీపతినీపద-సేవకుఁడనైనను

కాపాడుముసతతము-కనకాంబరధరా॥ శ్రీ॥
శబరినిగాచిన యభయమొసఁగి
శుభములొసఁగుమయ్యా సుందరరూపా॥ శ్రీ॥
రావణమదహర రణరంగభవ
యే వేళగలుగక దేవా! బ్రోవుము॥ శ్రీ॥

(నిష్క్రమించును.)

—♦—



# భక్తకబీర్.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

కబీరుని గృహము.

(ప్రవేశము సుందరాదేవి, కబీరు.)

కబీ—సుందరీ? జగన్నాటక సూత్రధారుఁడగు భగవానునకు నేఁడు గదా మనపైన సంపూర్ణానుగ్రహము గలిగినది? న్యాయము? ఎన్నివిషమపరీక్షల జరిపెనో.

గీ. సాధువులఁబంపి మనము భి । క్షులనుఁజేయఁ
గలుగుదుమొ లేమొయను పరీ । క్షలను సలిపి
నీపవిత్రచరిత్రమ । దేపగిదిని
నున్నదోయని పరీక్షించె । నోపడంతి.

అంతటితో విడువక మనచిన్నికుమారుఁడగు కమాలుని మొండెముగఁ జేసెఁగాని మన మాతనినే యాశ్రయించుకొని యున్నవారమగుటచేతనే మన మనోధైర్యంబున కచ్చెరువంది.

ఉ॥ తానెసహాయభూతుఁడయి । తానెజవేర్చె సమస్తకార్యముల్
మానినిభక్తవర్గము క్ర । మంబునదప్పకయాతనిన్ సదా

మానసమందు గొల్చెదరొ । మానదురో మదిదూరుచుందురో
నానిజమున్ గ్రహించునహ । హాపరమాత్ముని వింతచెయ్దముల్.

సుంద—దేవా! నేనును ఆసంగతియే చెప్పవలెనని యనుకొనుచుండఁగా తామే సెలవిచ్చిరి. కడచిన రేయి శ్రీరాముండు స్వప్నంబున సాక్షాత్కరించి యిట్లనియానతిచ్చె. భక్తురాలా! ఇప్పుడే నీ పెనిమిటితో సంభాషించివచ్చితి. సర్వసంగపరిత్యాగివై గృహంబువిడచి పుణ్యతీర్థంబుల సేవించుచుఁ ద్రోవనమధ్యమున దురాచారుల సదాచారులఁ గావించుచు మదీయ నామపఠన ప్రభావం బెఱిఁగించుచు.

మ. విపులంబై ధర నాక్రమించిన తమ । ద్వేషంబులన్ మాన్పి ని
ష్కపు దేవుం డొకఁడేయటంచుఁ దెలియం । గాఁ జెప్పియిట్లేనిపా
పపుపోకన్ బడిపోవ దేశహితముల్ । భానంబునందెంచి నా
కృపఁ గైకొంచు జనాళికెల్ల అను నెం । తేనచ్ఛబోధింపుమా.

అని మీకనుజ్ఞ నొసంగెనఁట.

కబీ—దేవీ! పరమాత్ముని మహిమ మెంతటిది! అంతియేగాక నీలాగునఁ గూడఁ జెప్పె. ఓయీకబీరా! నాకు నీవు నిష్కామము భక్తుండవు. బాల్యదశనాఁటనుండి నేమఱక నన్నుఁ గొల్చినధన్యుఁడవు. నీయందు నాకు పరిపూర్ణానుగ్రహముఁ గలిగె. అనుభవించవలసినదంతయు ననుభవించితివి. వంశపవిత్రుండైన కొమరుండు జనించె. నీకీర్తి యాచంద్రతారార్కము ధరామండలంబున నిలుచులాగున జేయఁగలధీరుఁడు నీకొమరుండు వివాహితుండై దేశహితార్థమై తన ప్రాణంబును ధారవోయులాగున ప్రమాణంబుఁ గైకొంటేఁ గావున నేఁటితోడ నీయసార ఘోరసంసార సాగరంబునుండి యీవలఁ బడుము. ప్రబోధగుఁడవు గమ్ము.

గీ. కొలఁది కాలములోన ని । శ్చలమున న్ను
తోడ నను నమ్మి గొల్చెడి । వాఁడు పుట్టు
వానిఁ గురుండవై నా ప్ర । భావములను
దెలిపి యుపదేశకుఁడ వౌచు । వెలయవలయు.

అని యానతిచ్చెఁ గావున నింకే! నీకు వేఱుగఁ దెలుపఁదగిన దేమున్నది! సర్వంబును సర్వసాక్షియగు భగవంతుఁడే దెలిపె. నేనిప్పుడే సన్యాసినై యాత్రార్థుఁడనై బయలువెడలెద. నీవునంబునఁ గొంతఁ దక్షివైరాగ్యమునవలంబించి సదా శ్రీరామచరణారవిందంబుల భజియించుచుండుము. ఇప్పుడే వచ్చెదను. అని;

(కీర్తన—కన్నడ, రూపకం.)

నాదు జన్మ సార్థకంబాయె - నమ్మి గొల్చుట శ్రీరాముని
పాదపాంసము లబ్బఁగఁబోయె-నా వంశము ధన్యమయ్యె నా॥

(నిష్క్రమించును.)

సుందరా—ఆహా! జగదుత్పత్తిస్థితిలయకారణభూతుండగు పరమాత్ముని యనుగ్రహము సంపాదించినవారి జన్మమే జన్మము. అనుచుఁ గబీరులవారింటిలో దూఱిపోయిరి.

గీ. కావిబట్టసుగట్టి జం । కనొక జోలెఁ
బెట్టుకొని రామచంద్రు ప । విత్రనామ
మును స్మరించుకొనుచు వచ్చె । డిని బలాత్క
రించె శిశివ్రుంశు సాక్షాత్క । రించినట్లు,

(తె అ లో)

మనసా శ్రీరాముని నామము భజింపుమా నిరతంబా
తని కృపచే మోక్షపదవి! తప్పక లభించు నీకు॥ మ॥

2. కపటవేషధారులయి జ । నంబుల మోసముంబొనర్చెదు
తపసులఁగని భ్రమఁ జెందుము । కృపజూపెడు హరినెప్పుడున్॥ము॥

సుంద—నాథా!

కబీ—సుందరాదేవీ! నన్నింక నాథాయని పిలుతువేల?

3. నాథుఁడెవ్వఁడు, భార్యయెవ్వరు । నాకు నీకు సంబంధమేమి
యీధరవీడిపోవునప్పు । డెవ్వరు వెనువెంట వత్తురు॥ము॥
తల్లీ! అట్టి మమకారంబులు వదలి నాకొక భిక్షఁ బెట్టి పంపుము.

సుంద—చిత్తము. (అని భిక్షఁ బెట్టు)

కబీ—ఓపరమవిశుద్ధురాలా! ప్రపంచమంతయు మిథ్య. పరమేశ్వరుఁడిట్టుల కపటనాటకంబుల నాడించుచుండునే గాని యొకరికిని వేరొకరికిని సంబంధమేమియు లేదు. సతులెవ్వరో, సుతులెవ్వరో, ఆప్తులెవ్వరో, యివ్వి రిత్తమాటలు. బొందిలో నూపిరున్నంతదనుకనే వారువీరుఁ గుశలమడుగుదురు. ప్రాణంపుగాలియు వదలిపోయిన వెంటనే యస్పృశ్యకళేబరంబుఁ గని భార్యయు భీతిఁ జెందును. ఆసమయంబున మనకాగమేమగును? ప్రేమాసంబంధము లేమగును? కాన నెవ్వరికిఁ బోరేయను పరమార్థంబును ముడివైచుకొని శ్రీపరమాత్ముని భజించుకొనుము.

సుంద—మహాప్రసాదము. దేవా! అదుగో కమాలు గారుబోలు వచ్చుచున్నారు.

(కమాలు ప్రవేశము.)

కమా—ఓహో! కబీరుదాసులవారు నేఁడు పరమాత్మునిఁ బోలుచు యాత్రార్థమై గాఁబోలు వెడలుచున్నారు. దేవా! వందనంబు.

కబీ—బాలకా! నీవు పవిత్రుఁడవు, వేదాంతసారసంగ్రహుఁడవు. శ్రీ జగదీశ్వరుని యనుగ్రహంబునుఁ బడసి సంసారసాగరంబును దరించి యీవలఁబడి కృతార్థుఁడవై పోవుచుంటివి. నీకుఁ దెలియని రహస్యంబు లేమియు లేవు. కావున భగవానుని యనుగ్రహపాత్రుండవై వానియాజ్ఞ నుల్లంఘింపక వర్తింపుము.

కమా—మహా ప్రసాదము.

కబీ—నేనింకఁబోయెదను.

శ్లో॥ కాతేకాంతా కస్తేపుత్ర
స్సంసారోయ మతీవవిచిత్రః
కస్యత్వంవా కుత ఆయాతః
తత్త్వంచింతయ తదిహభ్రాంతః ॥భ॥

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥భ॥

(నిష్క్రమించును.)

తృతీయరంగము.

(ప్రవేశము-భగవంతుఁడు.)

నా వలసిన కార్యంబులన్నియుఁ దీరినవి. కబీరునిఁబోలు భక్తుం డగు రోహిదాసు నాకృష్ణావతారాభివర్తనంబునఁ దన్మయుఁడైయుండు. ఈకబీరునారామావతారాభివర్తనంబునఁదన్మయుఁడైయుండును గాని యిరువురు నాయంశమువారేయనియు, ఆయవతారములు నావియేయనియు గుర్తింపఁజాలకున్నారు. నేనిప్పుడొక యంతర్నాటకంబునుగల్పించి వీరిరువురకును వాదప్రతివాదములఁబొసఁగించెద. వీరిత

గపుడిట్టి నాయకుచరులగు విఘ్నేశ్వరుని, సూర్యుని, బ్రహ్మను, సరస్వతిని, శివుని, పార్వతినిబంపి యిదినిమిత్తముగా వారలకు వీరి సందర్శన మిప్పించెద. ఇందువలన ననేక కార్యంబుల నెఱవేర్చినవాఁడనగుదును. దేవతలకుఁగూడ మాయంతటివారు లేరను గర్వము సంపూర్ణముగ గలదు. నిజముగా దేవతలేయిట్టిగర్వంబునుండిన మానవకోటియొనర్చు విపరీతచేష్టల కబ్బురపడనేల? తామే యీప్రపంచమున కాధారభూతులమని విఱ్ఱవీగు యీదేవతల గర్వంబు సర్వంబు ఖర్వంబు గాఁగలదు. భక్తులకా దేవతల సందర్శనమిప్పించినవాఁడనగుదును. దేవతల కాపూర్వమగు పరాజయము లభియించును. మఱియువింతచేష్టము లాభక్తులకు బోధపడి యింకమీఁదట నభేదవృత్తితో మెలంగెదరు. ఇందువలన మానవులందఱు సమానస్వత్వములు గలవారనియు, నానిజస్వరూపమెఱింగిన వారలకు మతమంతయు నొక్కటియే యనియు బోధపడఁగలదు. ఓసకలదేవతలారా! ఒక్కపరి యిటురండు?

(పార్వతీ పరమేశ్వరులు, సూర్యుఁడు, బ్రహ్మ, సరస్వతి, వినాయకుఁడు ప్రవేశము.)

కీర్తన-తోడి-రూపకం.

జయజయ గోకులబాల-జయజయగోవర్ధన ధర
జయజయ దానవభంజన-జయజయకరివరదాయక॥
తావకదర్శనమ్మున-ధన్యాత్ములమైతిమిమా
భావంబులు రంజిల్లెను-పరమపురుష వేద వేద్య॥జ॥
మమ్మిపుడు పిలచిన కార-ణమ్మును దెలిపినచో వే
గమ్మున నెఱవేర్చి మో-దమ్మునుగూర్తుము కేశవ॥జ॥

విష్ణు—అమరులారా! పరమభక్తులైన రోహిదాసు కబీరుదాసులు శ్రీరామ కృష్ణావతారములనుగూర్చి వివాదమ్ము లాడుచున్నా

డు. వారివాదంబులు చెప్పుమాత్రనేని జగత్కంటకము సంభవింపనేమోయని భీతిగలుగుచున్నది. వారిరువురునుగూడ వాదప్రతివాదముల నొకరికొకరు వెనుదీయువారు కారు. కావున విఘ్నేశ్వరునిఁ బంపి యీవాదంబుఁ దీర్చిరమ్మనుఁడు. వానిచేత నిక్కార్యంబు నెఱవేఱకున్నచో, సూర్యుఁడును, బ్రహ్మ, సరస్వతి, పార్వతీ పరమేశ్వరులును, వరుసగా వారికడకేఁగి వాదంబు నివారింతురు. అప్పటికేని వారు శాంతింపకేని యువ్వాలి కార్యంబును నేనే నెఱవేర్తును.

బ్రహ్మ—శౌరీ! ఈస్వల్పవాదంబును కంటకముగావలయునా?

విష్ణు—అట్లనకుము, భక్తాగ్రగణ్యుల నొప్పించుట నాయభిప్రాయము కాదు. సహేతుకరములగు వాదప్రతివాదములలోఁ దగవులఁ జెప్పుట దుష్టము. అందున మహానుభావుల మనంబులఁ ద్రిప్పఁ జాలము. ఎవరివాదమును వారు సమర్థించుకొనుటకై పెనఁగుచుందురు. కబీరు సామాన్యుఁడని తలంపఁబోకుము. పరమ తపోనిధియైన శుకులవారి యంశమున జనించినవాఁడు. కర్మక్షేత్రంబున వివిధమతంబుల నేర్పఱచుకొని జాతిమతకలహములఁ బెంచుకొని అధోగతిలోనున్నవారిని సముద్ధరింప నవతరించిన పుణ్యమూర్తి. ఏమిశంకరా! నీకుఁ దెలియదా!

శంక—వాసుదేవా! తెలియకేమి? నీవు చెప్పినచొప్పున వర్తింతుము. తొల్లి భరతమాత నాతోఁ గోలఁబెట్టు నీతో సంప్రతించి యొనర్చిన కార్యమేగదా యిది? ఇంతలోనే మరచితిమనుకొంటివా? మేమింకఁ బోయెదము?

విష్ణు—మంచిది పోయిరండు. నేనిప్పుడే కమాలునికడకు నరిగి వానికిఁ జెప్పవలసిన యంశములు జెప్పివచ్చెదను.

(అందఱు నిష్క్రమింతురు)

కబీ—మీకృష్ణుఁడు మొన్న మొన్న ద్వాపరము నందలివాఁడు. మా రాముఁడన్ననో త్రేతాయుగమునాఁటివాఁడు. చిల్లికజ్జాలను భోగించిపరులకొంపలఁదీసిన కృష్ణుఁడు పరబ్రహ్మమగునా? సర్వశ్రేష్ఠమైన పరబ్రహ్మమే ధర్మసంస్థాపనార్థమై శ్రీరాముఁడుగ నవతరించి దుష్టసంహారముఁ గావించి లోకకళ్యాణ మొనరించెనని శ్రుతిస్మృతులును, పురాణేతిహాసములును ఘోషించుచుండఁగాఁ దొంగకృష్ణుని నొకని జేర్చి దురాశచే పరబ్రహ్మమందు వేల ?

గోపి—వేదవేద్యమగు పరబ్రహ్మమే శ్రీకృష్ణపరమాత్మయని శ్రీమహాభాగవతము చాటుటలేదా? రామునివంటివారు పదివేలమందియైనను శ్రీకృష్ణునకుం జాలరు. నీవనినట్లు రాముఁడే ధర్మసంస్థాపకుఁడైనచో, వేదపారాయణాదికములు బ్రాహ్మణజాతియందు నిల్చియుండును. క్షత్రియజాతియందు జన్మింపనేల?

కబీ—ఓయీ గోపిదాసు! దానిరహస్యమిది.

సీ. బ్రాహ్మణాన్వయమున జన్మ । బడసెనేని
సహజాహంకారంబు జేయుం । బాడిగాదు
దండగించు లోకస్థుఁడై । దుష్టులను వ
ధించుటకు క్షత్రియకులమున । జన్మించెనయ్య.

మా రాముఁడు మీకృష్ణునకుఁ బలె గొల్లయింటఁబుట్టలేదుకదా?

గోపి—మా శ్రీకృష్ణమూర్తి గొల్లలలోఁ బుట్టినను చతుర్భుజత్వాది స్వాంశములతో నవతరించినాఁడుగాని కేవలము మానవుఁడై పుట్టినవాఁడుగాదు. లెమ్మా రాముఁడు గొప్పవాఁడో, కృష్ణుఁడు గొప్పవాఁడో లోకమే సాక్షియైయుండఁగా మనకు వృథావాగ్వివాదమెందులకు ?

గీ. తాపసుల హింసలం బెట్టి । పాపకృత్య
ములను బొనరింప రాక్షస । కులవినాశ
మునకు జనియించుమునను దాట । కని వధించె
దానఁ గలిగెడి దోసమిం । తేనియున్నె॥

మీకృష్ణునకుఁ బలెఁ బాలొసఁగ వచ్చిన నాతినిఁ జంపలేదులే.

రోహి—లోకమునందలి పసిపాపలకెల్ల నతఁడు మాయావేషంబున బాలొసఁగవచ్చితినను మిషతోఁ దనపొట్టఁ బెట్టుకొనుచుండుటచే నట్లొనరించెనుగాని వేఱుగాదు. దానియాథార్థ్య మెఱుఁగనేఱని నీయట్టియజ్ఞులట్టులనే తలంతురు. సర్వజ్ఞుఁడగు నమ్మహామహునకుఁ దెలియని విషయ మేమిగలదు?

కబీ—ఏమీ! కృష్ణుఁడు సర్వజ్ఞుఁడా?

గీ॥ అతఁడు సర్వజ్ఞుఁడేయౌచు । నలరెనేని
గారణం బేమి? సాందీప । కడను జేరి
విద్దెలఁ బడసినాఁ డిట్టి । సుద్దులేలఁ
జాలుమీకృష్ణుప్రజ్ఞలఁ । జాటుటేల?॥

రోహి—మీ రాముఁడు మాత్రము గురుశుశ్రూష నొనర్చలేదా?

కబీ—లేదు. తొల్లిసర్వశక్తుఁడయిన విశ్వామిత్రునికడ దాచుకొనిన బలాతిబలములను దివ్యవిద్యలఁ క్షణకాలమున గ్రహించి తన్మహిమంబువలననే సర్వజ్ఞత్వంబును బొందినాఁడు. మా రామమూర్తి సకలవిద్యాపారంగతుఁడైనందులకు మీకృష్ణునకు వలె,

ఉ॥ గొల్లలయిండ్లఁ జేరి పెఱుఁ । గుం జతివెన్నయుఁ బాలుదొంగయై
కొల్లఁగఁ గ్రోలలేదు, తన । గొప్పను వ్యర్థముగా నొనర్చలే

కారణంబు నెఱుంగనేరని మనము పామరులము. మనవలెనే మీరామునిఁపు పామరుఁడుగు చున్నాఁడు. కారణంబేమందువా?

గీ. జానకనిగోలుపోవుట । సంభవించి
ధైర్యమునువీడి తిండి ని । ద్రిలకు రోసి
చెట్టుచెట్టునకును మరి । గుట్టగుట్ట
కటులవిలపించి భీతాత్ముఁ । డైనకతన.

కబీ—సకలదేవతలును, దానవులబాధ భరింపఁజాలక విష్ణుమూర్తి తోఁగోలఁబెట్ట రాముఁడుగ నవతరించి దానవసంహారముఁ గావింతునని ప్రతిజ్ఞనొసర్చుటచే రావణసంహారమునపదియొక కారణముగఁ గల్పించిన లీలామానుష విగ్రహుండగుట మానవస్వాభావికముగ నటుల విలపించెను. తెలిసినదా!

విఘ్న—(ప్రవేశించి) ఈ రోహిదాసు కబీరుదాసులు వచ్చువారలై లేనిపోని వాదప్రతివాదములు సల్పుచున్నారని తెలిసికొని విష్ణుమూర్తి వీరితగవు నివారింపవలసినదని నన్నంపినాఁడు గదా? వీరిపై ఖరులను బట్టిచూడ నతిపట్టుదలతో నున్నట్లుదోచుచున్నయది. వీరివాద మత్యాశ్చర్యముగ నున్నది. ఒకరికొకరుదినిపోవనటులఁ గానఁబడుచున్నారు. ఏలాగున వీరితగవుఁదీర్పవలయునో తోఁచకున్నది. అయినను విష్ణుమూర్తియాజ్ఞానువర్తినై మెలంగెద. (ప్రకాశముగా) ఓయీ కబీరూ! రోహిదాసువాదన సహేతుకరముగానున్నను వానిమాటఁద్రోసిరాజనుచు న్నావేమి? ఇది యెంతమాత్రము సరిగాదుసుమా.

కబీ—ఓహో! మధ్య నీకెవరు? నాయనా!

గీ. పొట్టవేసుక నిటువచ్చి । నట్టనడుమ
నాదిపెట్టుమటంచు మా । వాదమందుఁ

చేసియేమొ ప్రసంగంబుఁ । జేయసాగి
నాఁడె వేమిన్యాయము? గిరి । నాథనీకు.

గీ. బొట్టునుం గాటుకన్ బెట్టి । యెట్టులైన
మాతగివుఁడిర్చ్చుమని బ్రతి । మాలినాఁడొ
లంచముగనిన్ని సుతుముల । ర్పించెదమని
న్యాయమే యిట్లురా? గిరి । నాథనీకు.

గీ. పనికిరానట్టి మాటలఁ । బలికినీదు
పాత్కికపుబుద్ధిఁ జూపంపఁ । బాటుపడుచు
వేనియమూరకిడిలెడి వాఁడఁ । గానసుమ్ము
చెడపసన్న నిష్ఠూర్యంబుఁ । బెట్టవలదు.

పినా—నాయనా? చాలుచాలు నాకెందుకులే.

సూర్య—(చివాలున ప్రవేశించి) నాయనా! కబీరూ! తొందరపడ
కుము. గోపీదాసు వచియించినదే నిశ్చయము. ఊరకొనుము.

కబీ—ఓహో! కేమరా! ఈలాగివుఁ దీవ్వుటకేనా! పండ్లూడిపోయిన
ముసలి వేసము వేసికొనివచ్చినది? అవును. నేనే పొరబడుచు
న్నాను. నీపండ్లప్పుడూడినవిగావు నేనెఱుఁగుదును.

గీ. విప్రమో పేతుఁడైన యా । వీరభద్రు
మీఁద కెగబడగిఁనేల యీ । వాదటంచు
నిష్ఠముగనున్నప్పుడు కొప్ప । చేసియుఁ దస
కుండ నీపండ్లు పండ్లూడ । గొట్టినాఁడు.

ఓయీ! సూర్యుఁడా! నీవంశీకుఁడగు రామభద్రుని ప్రభావ
మెఱింగి యుండియుఁ గూడఁ గులధర్మంబులఁబీకుబుచ్చి యెవ్వఁడో
కృష్ణుండు గొప్పవాఁడని వాదించుచున్న యీపామరుని వాక్యంబుల
సమర్థింప జూచుచున్నావేమి? చాలుచాలు. బోసినోరుఁ దెఱువక
పొమ్ము.

బ్రహ్మ—(ప్రవేశించి) కబీరూ! పిన్నపెద్దలనియెడి తారతమ్యంబు
లేకుండ మాటాడుచున్నావు. శ్రీనివాసదేవుని భక్తాగ్రేసరుం

దీయశక్తి జగంబునఁ । దేటఁబడియె
నీ వఱకె నీకు లేల వ । చింతు విప్రుఁడ.

అత్తగారియందు నీకుఁగల భక్తివిశేషములను బట్టియే నీవెంత నీతిమంతురాలవో తెలియుచునే యున్నది. అత్తగారిపొత్తు బొత్తుగా గిట్టని నీవు గూడ నీతులఁ జెప్పవలయునా! చాలుచాలు. దయచేయుఁడు.

(అంతఁ బార్వతీ పరమేశ్వరులు ప్రవేశింతురు)

శివు—ఓయీ! పరమభాగవతోత్తమా! కబీరా! నీకును రోహిదాసునకును జరుగుచున్న వాదప్రతివాదములఁ దీర్చిరమ్మని విష్ణుమూర్తి పంపఁగా వచ్చితి. రోహిదాసు వాక్యంబు లసత్యంబులు గావు. నిజముగా వాసుదేవుని మించు దైవంబు లేఁడు. కాబట్టి నీవిరుద్ధాభిప్రాయముల నుపసంహరించుకొని యీ వాదంబును వదలుకొనుము.

కబీ—ఓహో! మీరేనా? అర్ధనారీశ్వరులా? ఎవరో యనుకొంటిని. ఇప్పటినుగాని కథరక్తిగట్టదు. మాతగవు తీరదు. రామునిభక్తుండవై రాముఁడే నీయిష్టదైవంబని యెఱుంగక గురుద్రోహంబునకుఁగూడ నడుముఁగట్టుకొనుచుంటివా? కృష్ణుఁడు సర్వోత్తముఁడను తగవు జెప్పుటకు నీకు నోరెట్టులాడినది?

గీ. చాలు సిగ్గింతలేక గం । జాయిఁ బీల్చి
తినుచు నుమ్మెత్త విత్తనాల్ । దేహమెల్లఁ
గంపమెత్తిల్లుచు శ్మశాన । మందుఁ జేసి
కాని సుఖం చెడి నీమాట । విను నదెవరు?

గీ. అపుడు పార్వతితో జూద । మాడియోడి
కూటసాక్ష్యం బొసంగఁగాఁ । గోరిహరిని
సత్యదూరుఁడ వైనని । సాహసంబుఁ
దెలియనేరని వారికిఁ । దెలుపఁబొమ్ము.

యుక్తాయుక్తవిచారణశూన్యుండవై మొండివాదము లాడినం దుననేమిప్రయోజనము? నీకుబుద్ధిలేకపోవుటయేగాకఁ బరులిది న్యాయంబుగాదని మందలించినను వినక వారల నెత్తిపొడుపు మాటలచే నీసడించుచున్నాఁడవేమి? దూరాగతినాలోచించుకొని మఱియు వాదులాడుము. నీవెంతగాంజూకొనుచున్నను రాముఁడు ఘనుఁడు కాఁడు. కృష్ణుఁడే ఘనుఁడనియుఁ, బరమపురుషుఁడనియు సహేతుకముగా, నిరాఘాటముగా వాదించుటకు నేను సిద్ధుఁడను. కానిమ్ము.

కబీ—ఓయి నిశాచరుఁడా!

గీ. తామసుండవు రామమం । త్రంబుఁ దక్క-
నేని నీనైజగుణమును । మాన లేదు
వేమునకుఁ బానకముఁబోసి । పెంచ నేని
దానియందుఁగల చేదింత । యణఁగునేల.

ఓయీ! దైవశిఖామణియైన రాఘవుని కాదని తెగువఁజెప్పితివా? పొమ్ము. పొమ్ము. శ్మశానములోని బీనుంగులు వృథ కాఁగలవు.

శివు—ఓరీ! మూర్ఖుఁడా! పొగరుబోతా! ఏమిరావాగితివి? శ్మశానంబునఁ బీనుఁగులు వృథయగునా? క్షణకాల మోపికఁ బట్టుము. నీగర్వమూడ్చి నిన్నుఁగూడ నాపీనుంగులతోఁ జేర్చెద. నోరు మూసికొనుము.

కబీ—ఓశంకరమూర్తీ!

గీ. గుడ్డిబెదరింపులకు భీతిఁ । గొనుచుఁ బాఱి
పోవనేర్తునిదలఁచితో? । పావనుండగు
రామమూర్తికి భక్తుండ । నీమహాస్త్ర
ములను మన్మథునకుఁజూపఁ । బొమ్ము పొమ్ము.

నీయాటలు నాకడమాత్రము సాగవు. దయచేయుము.

శివు—అట్లనా! ఓరీ మూర్ఖుఁడా! ఇదే మదీయత్రిశూలమున నీ కావరమణఁగింతు. నిన్ను రక్షింప రాముఁడు వచ్చునో! వాని తాతయే వచ్చునో! కాచికొమ్ము.

కబీ—నీ మత్రిశూలప్రభావమును ఏమెచ్చుకొనుటకు నాయొద్ద శ్రీరాముని పవిత్రనామమున్నదిలెమ్ము. సరిగా నాలోచించినఁ ద్రిశూల ప్రతిమానమగు యీ దుష్టకత్తియే చాలును. నన్ను భయపెట్టకుము.

(అంత విష్ణుమూర్తి రామరూపమునఁ బ్రవేశము)

రాము—ఓయీ కబీరూ! ఏమి చేయుచున్నావు. శాంతింపుము శాంతింపుము.

కబీ—దేవా! శ్రీరామచంద్రప్రభూ!

శ్లో॥ జయజయ రఘురామ శ్రీముఖాంభోజభానో
జయజయ రఘువీర శ్రీమదంభోజనేత్ర
జయజయ రఘునాథ శ్రీకరాభ్యర్చితాంఘ్రే
జయజయ రఘువర్య శ్రీశకారుణ్యసింధో॥

శ్లో॥ వందే సాగరగర్వభంగవిశిఖం వందే జగజ్జీవనం
వందే కౌశికయాగరక్షణకరం వందే గురూణాంగురుం
వందే బాణశరాసనోజ్జ్వలకరం వందే జటావల్కలం
వందే లక్ష్మణభూమిజాన్వితమహం వందే సదా రాఘవం॥

శ్లో॥ వందే సాధకవర్గకల్పకతరుం వందే త్రిమూర్త్యాత్మకం
వందే నాదలయాంతరస్థలగతం వందే త్రివర్గాత్మకం
వందే రాగవిహీనచిత్తసులభం వందే సభానాయకం
వందే పూర్ణదయామృతార్ణవమహం వందే సదా రాఘవం॥

(అని ప్రదక్షిణ మొనర్చుసంతలోనే రాముఁడదృశ్యుఁడై కృష్ణరూపమున సాక్షాత్కరించును)

రోహి.—దేవా! శ్రీమన్నారాయణమూర్తీ! దాసుండనను.

శ్లో॥ చాపల్యసీమ చపలానుభవైకసీమ
చాతుర్యసీమ చతురాననశిల్పసీమ
సౌరభ్యసీమ సకలాద్భుతకేళిసీమ
సౌభాగ్యసీమ తదిదం వ్రజభాగ్యసీమ॥

శ్లో॥ చిత్రం తదేతచ్చరణారవిన్దం
చిత్రం తదేతన్నయనారవిన్దమ్
చిత్రం తదేతద్వదనారవిన్దం
చిత్రం తదేతత్పునరమ్బ చిత్రం॥

శ్లో॥ మధురం మధురం వపురస్యవిభో
ర్మధురం మధురం వదనం మధురమ్
మధుగంధి మృదుస్మితమేతదహో
మధురం మధురం మధురం మధురమ్॥

కృష్ణుఁడు.—భక్తాగ్రేసరులారా! మీ యిరువురి వాదములును సహేతుకములైనవే. మీరింకఁ బోరాడఁబనిలేదు. మీ చరిత్రములు పవిత్రములైనవి. మీ భక్తి కొనియాడఁదగినది. ధర్మసంస్థాపనార్థమై యొక్కొక్క యుగమునం దొక్కొక్క రూపుఁడనై యవతరించి లోకకళ్యాణ మొనరించుచుండుటయే నావిధి. నేనే విష్ణుమూర్తిని. శ్రీరామ కృష్ణావతారములు నావియే. సర్వాంతర్యామినై యుండి నేరినంటకుందును. మాయాతీతుఁడనై మాయకులోఁబడిన వానివలె నటించి లోకమును భ్రమింపఁజేయుట నావిలాసము. దేశంబునకుఁదగిన వేషము, వేషమునకుఁదగిన భాష, భాషకుఁదగిన నడవడిగలిగి యుండుట ధర్మంబగుటచె నాయాప్రకృతుల ననుసరించి సమయానుకూల

మూఁగ, భ్రామరునివలెను, బధిరుని వలెను, బ్రవర్తించుచుం డుట నాస్వభావము. నాహావభావవిలాసాది గాంభీర్యప్రకటన ములను తత్త్వవేత్తలయిన వారలు గ్రహింపవలసినదే గాని సామాన్య మానవులు నన్ను గుర్తింపఁజాలరు. పూర్వభవార్జిత కర్మంబును దెప్పుడే ననుభవించి తీఱవలయునను సూక్తిని లోకంబునకు విశదపఱచుటకే రాముఁడైన వాలిని వధించి తత్ప్రారబ్ధంబునఁ గృష్ణుఁడైన గిరాతునిచేత బాణఘాతముచేఁ దేహమును జాలించినట్లు సూచించెను. అల్పమతులై అల్పాయుష్యులైన మనుష్యులచేత నెఱిఁగియుండ మలరుచుండుటకుగాను నట్టి మూఢమతుల పత్నీపతుల హృదయంబులఁ బవిత్రపఱచుటకే యానిస్సీమముగా వచ్చిన వెన్నునలో నగము చాలియు నగము కాలని దేహముతోఁ గొట్టుకొనివచ్చి జీవన్మృతమునందు నొసె నది. తపోయోగధ్యాన ధారణాది శక్తులతోఁ గూడి దేలుచుండు [illegible] యెంచి యూరకయుండక [illegible] [illegible] నామంబులు [illegible]యు,

హరేరామ హరేరామ రామ రామ హరే హరే

హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥

అను జపనామ శబ్దంబులతో సంకీర్తించును నిహపరసాధకుఁడ తిని. ఎట్టి మూఢులైనను, యెట్టిదుష్టులైనను యేకాలమునందేని బవిత్రితమైన యీమంత్రంబులు నిర్మలచిత్తంబున ధ్యానించి నన్ను స్మరింతురేని వారినిధన్యులుగా నొనర్చుచుందును. తొల్లి రామావతారంబున వనులలోఁ గ్రుమ్మరుచుఁదిరుగుచున్నప్పుడు నాదివ్యమంగళ విగ్రహంబునుజూచి యచ్చెరువంది యచటవసించుమునీంద్రులెల్ల నన్ను గాఢాలింగన మొనర్ప నుద్యమింప శ్రీకృష్ణావతారమున మీయభీష్టంబీడేర్చెదనని యభయహస్తంబొసంగినవాఁడ నగుటచే నేను

కృష్ణుండనై వారిని గోపికలుగ సృజింపఁజేసి వారికి గాఢాలింగనంబిచ్చి తరింపఁజేసితినిగాని వేఱొండుకాదు. నాచేఁదరింపఁజేయఁబడియాగోపిక లేకొందఱొక్క కాలంబున నన్ను స్థలికి బ్రహ్మచారియనియుగ్గడించిరి. అది యంతయు నామాయావిలాసమని నమ్ముము. తైలధారవలె నవిచ్ఛిన్నమైన ధ్యానముతో నన్నారాధించుటం బట్టియే వారెల్లరు సద్గతులనంది పరిపూర్ణసౌఖ్యాంబుధిని దేలాడుటకుఁ గారణంబైనది. కావున రాముననైన కృష్ణుననైన భేదప్రవృత్తిఁ జేయఁజనదు. అట్టిభేదప్రవృత్తి గలుగఁజేసికొని మీరు వాదప్రతివాదమొనర్చుటచే నిరువురును నమదోషులైరి. నీచులింకను నామహాత్మ్యమెఱుంగలేక నాయందు సామాన్యమనుష్యత్వ మారోపణమొనర్చి వాదులాడుచుండురు. సచ్చిదానంద నిత్యనిర్మలస్వరూపలక్షణాన్వితుండై, యాదిమధ్యాంతరహితుండై, యవాఙ్మనసగోచరుండై సర్వవస్తువులయందు, సర్వరూపములయందు, సర్వవ్యవహారములయందు, నాపరబ్రహ్మలయుక్తమైయుండునని నెఱుంగుఁడు. నాస్వరూపస్వభావలక్షణములు గుర్తెఱిఁగి సుకృతానందానుభవశేషంబులయందు భేదవృత్తినిఁ గలిగి ప్రవర్తింపుము. గోపాలదాసా! నేనిప్పుడు వక్కాణించినదంతయు వింటివి గదా? ఇఁక మీరిరువురు నైకమత్యాభిమానంబులు గలిగి పరస్పరాభిప్రాయములఁ దెలిసికొని ప్రవర్తింపుఁడు. నేనిఁకఁబోయెదను.

(నిష్క్రమించును.)

విఘ్నే—ఓబ్రహ్మరుద్రాదిదేవతలారా! చూచితిరా? విష్ణుమూర్తి యెట్టికపటనాటకమాడించినాఁడో? అందుచేతనే యిట్టికపటనాటకములకే సూత్రధారుండై మనలనందఱిని బాలురనుగా నొనర్చి ఖేలనంబొనర్పఁజేయుచుండును. ఈభక్తాగ్రేసరు లిరువురకు మనసనిజరూపదర్శనంబిప్పింపఁగోరి యుక్తులొనర్చి మాయామానుష విగ్రహులుండని తననామంబును సార్థకపఱచుకొని

యంతర్ధానమయ్యెను. మనమింక నిచటఁ జేయఁదగిన దేమున్నది? పోవుదము పదుండు. (అందఱు నిష్క్రమింతురు.)

రోహి.—కబీరుమహాశయా! మనవాదంబు లంతంబుఁ జెందినవి. ఈసమయంబునవీరే వచ్చి మనవాదములను దీర్చకున్నచో రామావతారవర్ణనమున నేనును, కృష్ణావతారవర్ణనమున నీవునుయీంకఱకెకడ తేరియుందుము? తెరచినఁగాని పాలలోనుండి వెన్నరాదను సంశయము నిప్పటికిఁ గదా దృఢపఱచుకొంటిమి. అజ్ఞాననాశంబునకు బలికిన నాయవాచ్యములను మన్నింపవేఁడెదను.

కబీ.—రోహిదాసూ! తర్కవితర్కములవల్ల నేగదా పరబ్రహ్మ స్వరూపముఁ గాంచఁ గల్గితిమి. మనకీ వాదమే లేనిచో మన జన్మలిట్లు ధన్యతఁ గాంచునా? సకలదేవతానీకంబు మనకు గోచరంబగునా? తొలుత నీవెట్టి యజ్ఞతలోనుంటివో నేనును నట్టి యజ్ఞతలోనుండఁబట్టితివో గదా! లేనిపోనివాదంబున కుపక్రమించినది. ఇందుమన్నించఁదగిన దేమున్నది? రామకృష్ణులకు భేదప్రవృత్తిఁ గలిగించుటయుండా? సములమైతిమి. వాగ్ధారగా తీసిపోయితిమి. అవతారాభివర్ణనములకా! లోఁగనైతిమి. కావున నీమనంబున నట్టి సందియంబుఁ బెట్టుకొనకుము. నేనింకఁ బోయివచ్చెదను.

రోహి.—దేవా! నాదొక చిన్నవిన్నపము గలదు. మనమిరువురముఁ గూడ నాపరబ్రహ్మముయొక్క భక్తులము గనుక నను శాత్తుఁగ దయచేసి నామందిరంబుఁ బవిత్రముఁ జేసి నన్నుఁ గృతార్థచేతునిఁ గావించిన మీరిప్పుడే వెడలుట ధర్మముగాదు. నా యింటలెక్క మూఁడు దినంబులుండి నన్నుఁ బవిత్రునిగ నొనర్పవేఁడెదను.

కబీ—దానికై నన్నింతగా నర్థింపవలయునా? అవశ్యమట్లనే యుం
దును. దీనివలన లోకమున కొక్క గుణపాఠము నేర్పినవార
మగుదుము. ఏదందువా?

గీ॥ జాతిమతములటంచుఁ గ । లహించి
మూర్ఖులై పోవుచుండిరి । బ్భువిని ప్రజలు
మానవానీకమంత స । మంబెయనుచుఁ
దెలియనేరుతు రిఁకల న । ర్తించుకతన॥

రోహి—దేవా! అట్లయిన నాలస్యమొనర్పక స్నానమునకరిగెదమా!

కబీరు—మంచిదట్లనే గావింతము.

(అందఱు నిష్క్రమింతురు.)

౩ రంగము.

ప్రవేశము! కబీరు, లక్నోఫాదుషా.

ఫాదు—మహాత్మా! అజ్ఞానవశంబున నేనాడినపలుకులు క్షమించి
నాకు రామనామమంత్రోపదేశంబొనర్చి ధన్యునిఁ జేయ వేడెదను.

కబీ—ఓయీ! ఇందుకింత దగిన దేమున్నది? పరమాత్ముని మహి
మంబెఱుంగనేరక సజ్జనుఁడవై పలికియుందువు. మాయట్టివా
రని గణింపనేరరు. శ్రీరామభద్రుని తత్త్వంబెఱుంగుట సులభ
సాధ్యముగాదు. రామాయణమును జదువువార లనేకులుగలరు
గాని యందలి నిజసారాంశము నెఱుంగరు. వినుము. మోక్ష
మను నయోధ్యాపురవరంబును పరబ్రహ్మమను దశరథుఁడు
పరిపాలించుచుండె. అతనికి జ్ఞాన, యిచ్ఛా, క్రియాశక్తులను
ముగ్గురుభార్యలు గలరు. వారిలో జ్ఞానశక్తియే కౌసల్య. ఈ
జ్ఞానశక్తియనియెడి కౌసల్యకే యాత్మయనెడి రాముఁడుద్భ
వించె. అవ్యక్తమగు బాల్యావస్థచేతఁ దననిజస్వరూపమును
మఱచియజ్ఞానమయుఁడగు జీవాత్మ తానేయనిభ్రమసి దేహేం

ద్రియాది ప్రపంచమునందు మిక్కిలియనురాగముంచి శ్రవణ
మను వశిష్ఠనీతిచేఁ దెలివిగలిగి, వైరాగ్యమను సౌమిత్రినిఁగూడి
మననమను విశ్వామిత్రునితోఁ బయనంబై, పంచమహాపాతకం
బులను పర్వతంబులఁగడచి, జ్ఞానమను బాణముచే నావరణమును
తాటకినిజంపి, యిచ్ఛయనుమారీచుని సాగరంబునఁబడవైచి
వికారములను సుబాహ్వాది పెక్కురక్కసులఁ గెక్కురుమన
గండ నుక్కడఁగించి, దురాచారంబనియెడి రాతిని బదతాడ
నంబొనరించి, సదాచారంబను నహల్యాసతింగాచి, యేకాం
తంబను మిథిలాపురంబునకుంజని, శాంతమను జనకునిఁజూచి,
యసూయయను శివచాపంబువఱిదుంచి, యానందంబను
జానకిని బరిణయంబయ్యె. పిమ్మట నెదిరించిన మదమను పరశు
రాముని గర్వభంగముఁగావించి, మోక్షంబనియెడి యయోధ్య
కుఁజేరి ప్రాణజీవుండను దశరథుఁడు భ్రమసి, సత్వగుణహీనునియొక్క
పట్టాభిషేకంబుఁ జేయ యత్నింప, దురాశ క్రియను కైకవలనఁ
జపలత్వమను విఘ్నంబుసంభవింప, పరబ్రహ్మమను దశరథు
నిఁబాసి, మోక్షంబను సాకేతపురంబువీడి, యానందవైరా
గ్యంబులను సీతాలక్ష్మణులు వెంటరాఁ జిత్తంబను సరయూ
నదినిదాటి, బుద్ధియను గుహునిచే [illegible]
యెడి చిత్రకూటంబున నిలిచి, మనస్సను [illegible]గాసి
బెట్టి, వీరత్వంబను నగస్త్యునివలన ధైర్యంబను దివ్యాస్త్రంబును
గ్రహించి, కామంబను శూర్పణఖను గుహాపిలిగాఁ జేసి, యా
[illegible]ంబులనియెడి ఖరదూషణాదిరాక్షసులనుగూల్చి, ఆత్మయను
రాముని యిచ్ఛయను మారీచుఁడు మోసమొనర్చె. రాజసం
బను రావణుఁడు దండమనుసన్యాసియై యానందమను సీత
నెత్తుకొనిపోవ నాత్మయనురాముఁడు విజృంభించి, యిచ్ఛయను

మారీచుని సంహరించి యానందంబను సీతను గానక మిగుల దుఃఖముఁ జెంది వైరాగ్యమను సౌమిత్రి వెంట నడువ విక్షేప మను సరణ్యమునఁ దిరుగుచు వివేకమను జటాయువును విమల త్వమను సద్గతినొందించి, చింతయనుకబంధుని పోనడచి, సం తోషమను శబరినిగాంచి, మనోవికాసమనుపూజఁగైకొని, నిధి ధ్యాసమను కపీంద్రునితో స్నేహముఁ జేసి, భయమను వాలిని గొట్టి,నిర్భయమను సుగ్రీవునిచేఁబట్టి, నిధిధ్యాసంబను నాంజనే యుని ప్రోత్సాహపఱచ నతఁడు మోహమను జలరాసిదాటి లోభమను లంకఁగాల్చి దుర్వాసనలనురక్కసుల మట్టుఁ బెట్టి యానందమను ధరణిజం గనిపెట్టి సంకల్పమను యశోక వనమును బొంపుజేసి యజ్ఞానమను జంబుమాలిని నిర్మూలనముఁ జేసి సంశయమనునక్షయకుమారుని శిక్షించి, విపరీతంబను యిందృజిత్తునువిదలించి, భ్రమయనుపాశమునుద్రెంచి, రాజస మను రావణునిధిక్కరించి, మానమను మహాయగ్నినిగావించి, దుఃఖమను లంకనుగాల్చి, మోహమను సముద్రముదాటి, యాత్మ్మఁడను రామునిఁ జేరి యానందమను సీత సంగతి వివరిం పఁగా నాత్ముఁడను రాముఁడు విడువక మోహమను సాగర మును భంగపెట్టి నిశ్చలత్వంబనియెడి సేతువుంగట్టి సత్వంబను విభీషణునకు శరణంబిచ్చి, విపరీతంబను నిందృజిత్తునెదిరించి సందేహమను నాగపాశములోఁజిక్కి, సద్విచారమను ఖగేం ద్రునివలన ముక్తిజెంది, తామసమను కుంభకర్ణుని సంహరించి భ్రమయను శక్తిచే వైరాగ్యమను సౌమిత్రిమూర్ఛఁజెంద నిధిధ్యాసమను కపీంద్రుని ప్రేరేపించి నిష్ఠయను సంజీవపర్వ తంబును దెప్పించి, వైరాగ్యమను లక్ష్మణుని మూర్ఛఁదేర్చి,

కబీ—ఓయీ! నీవు నేఁటినుండి శ్రీరామభక్తుండవైతివిగాన నీకు నేను రామనామమంత్రోపదేశ మొసఁగుదు. ఇటువినుము. (అని చెవులోఁ జెప్పి) దీనిని పరమనిష్ఠతో జపియించుచు దేశాభ్యుదయమునకుఁ బాటుబడియెడవేని.

ఉ॥ భారతమాత సంతసిలు । పావనమూర్తి భవదీయజన్మ! నే
వారలఁ జూపనట్టి గుణ । వంద్యుఁడ వీవని మెచ్చుకొందుఁ బా
పాత్ముల తాపితాననిశి । తోగిర్లపవిత్రచరిత్రుఁ జూపదో
ద్ధారక దైవ రాముఁ డను । వంబున మోక్షపదంబు నీకగున్ ॥

ఫాదు—చిత్తము. నేనెన్ని విధు లెప్పియో సెలవియ్యఁగోరెద.

కబీ—భక్తుఁడా!

మ॥ కరుణాళుత్వము, సత్యసంధతయు లో । కజ్ఞానముం శౌచముం
బరితోషసందము, మాతృసేవ, యశముం । వీరత్వముం గల్గి యీ
నరు లెప్డుం జరియించులాగున నుప । న్యాసంబులం జేసి దు
ర్భరమహాత్మ్యము తెల్లఁ బోనడచు మా । ర్గంబీవనుష్ఠింపుమా॥

ఓయీ! నీయుత్తమ తాత్పర్యము నీసమారాధనకుఁ బట్టాభిషేకముగావించెదము. మనమూలస్థ మొసరింపఁజనదు. నేనిప్పుడు పరమభక్తుండయిన గోపన్నగారికి రామనామమంత్రోపదేశ మొసర్పఁ బోవఁ బరమేశ్వరునిచే ననుజ్ఞాతుఁడనైతిని. కావునఁ బోవుదమా?

ఫాదు—మహాత్మా! నమచేనిప్పుడు మంత్రోపదేశమును బొందితిని గదా! ఆశీర్వాద మొసంగరా?

కబీ—దానికేమి? నీకొక్కనికేగాక సకలమానవులకు మన మొసర్పనున్న హితోపదేశపర్యటనమునకు విజయంబు లభియింప మనమూ పరమేశ్వరుని ధ్యానింతము? పిమ్మట నాశీర్వదింతము.

## కీర్తన.

రాగం పూరికళ్యాణి—రూపకం.

భానువంశభూష రామా - భవ్యగుణనికాయ రామ!
దీనులమగుమా మొఱలనీ - వీనులజేర్పుము రామ॥ భా॥
దేశమధోగతిలోఁబడి - దీనతనపంగియున్నది,
యీశా పునరుద్ధారణ - కిదెవెనఁలుచు నుంటిమయ్య॥ భా॥
రోగులు చోరులును దురా - చారులు విపరీతంబయి,
ఘోరపాతకములకుఁ - పాల్పడి కూడిరియభిరామా ॥భా॥
సుగుణాత్ములబాధించుచు - భగవంతునివిస్మరించుచు
జగమునతమయుండెదరిది । జ్ఞానులతేరనిపీడఁజడి॥ భా॥
పూర్వోన్నతిఁజేకూర్పఁగ - సర్వముఁదిద్దఁగయుంచి యుగం
సర్వభంజకుఁడవగుననిను - గాఢముగా నమ్మినాము॥ భా॥

పాదు—మహాత్మా! ఇటగునుగాక.

గీ॥ పాపపంబగు భారత । వర్షమందు
మానవులు వేదవృత్తులు । మాని సర్వ
మతములొక్కటియే యను । మాటనమ్మి
యేకమత్యాభిమానులై । యలరుఁగాత॥

కబీ—తథాస్తు.

(అందఱు నమస్కరించెదరు.)

సమాప్తము.

## ఆంధ్రనాటకములు.

| | | |
|---|---|---|
| సీతాకల్యాణము | 0 | 8 |
| లక్ష్మణమూర్ఛ | 0 | 12 |
| సుగ్రీవ పట్టాభిషేకం | 0 | 12 |
| రామరావణయుద్ధము | 0 | 12 |

విష్ణుభట్ల సుబ్రహ్మణ్యస్వాము గారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| సారంగధర | 1 | 0 |
| కుశలవ | 0 | 12 |

గూడూరి కోటీశ్వరరావుగారిచే రచియింపఁబడినవి

| | | |
|---|---|---|
| సంపూర్ణ రామాయణం | 1 | 4 |
| లంకాదహనము | 1 | 0 |
| పురూరవ (జయప్రద) | 1 | 0 |
| కాంతామతి | 0 | 12 |
| జగన్మోహన | 0 | 12 |
| మారుతీమైరావణ | 0 | 12 |
| సీతాకళ్యాణము | 0 | 12 |
| పద్మినీలోకబాంధవం | 0 | 10 |
| తిలోత్తమ | 0 | 12 |

కేసవరపు శివరామశాస్త్రిగారిచే రచియింపఁబడిన.

| | | |
|---|---|---|
| భక్తరామదాసు | 1 | 0 |

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| మార్కండేయ | 0 | 12 |

## ఆంధ్రనాటకములు

| | | |
|---|---|---|
| శివాజీవిజయం | 1 | 0 |
| పాంచాలీమానసంరక్షణము | 1 | 4 |

సంపత్కుమారంబసింగరాచార్యులు గారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| సంగీత కృష్ణలీల | 1 | 0 |
| మహాభారతము | 1 | 4 |

చక్రవధానుల మాణిక్యశర్మ గారిచే రచియింపఁబడివి.

| | | |
|---|---|---|
| పద్మవ్యూహము | 1 | 0 |
| శ్రీకృష్ణ రాయబారము | 0 | 12 |
| శ్రీకృష్ణ రాయవిజయం | 0 | 12 |
| చంద్రకాంత | 0 | 10 |
| బిల్వమంగళ చింతామణి | 1 | 0 |
| సంగీత గులోబకావళి | 1 | 0 |
| సంగీత విష్ణులీల | 1 | 0 |
| సంగీతసావిత్రి | 1 | 0 |
| సంగీత ప్రహ్లాద | 1 | 0 |
| సత్య హరిశ్చంద్ర | 1 | 0 |
| సంగీత స్త్రీసాహసం | 0 | 12 |
| సంగీత కృష్ణలీల | 1 | 0 |
| లవకుశ | 1 | 0 |
| చిత్రనళీయము | 1 | 4 |
| భూలోకరంభ | 1 | 0 |
| కనకతార | 1 | 0 |
| సంపూర్ణ రామాయణం | 1 | 4 |
| సంపూర్ణ భారతం | 1 | 4 |

వలయువారు :— కురుకూరి సుబ్బారావు,

**సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.**

## ఆంధ్రనాటకములు.

| | | |
|---|---|---|
| పాదుకా పట్టాభిషేకం | 0 | 12 |
| లంకాదహనం | 0 | 12 |

కాశీనాథుని వీరమల్లయ్య గారిచే రచియింపఁ బడినవి.

| | | |
|---|---|---|
| సత్య హరిశ్చంద్ర | 0 | 12 |
| లంకాదహనము | 0 | 8 |
| కుశలవ | 0 | 12 |
| సీతామనోహరం | 0 | 8 |
| తారాచంద్రీయము | 0 | 12 |

వేంపటి వేంకట నారాయణగారివి

| | | |
|---|---|---|
| స్త్రీసాహసము | 0 | 10 |
| లంకా దహనము | 0 | 10 |

అయినాపురపు సుందరరామయ్య గారిచే రచియింపఁ బడినవి.

| | | |
|---|---|---|
| ఊర్వశీ శాపవిమోచనం | 1 | 0 |
| గులేబకావళి | 1 | 0 |
| జయచంద్ర చంద్రరేఖావి జయం లాల్ గోహారు | 0 | 12 |
| పసబకావళి | 1 | 0 |
| బంగన్ బకావళి | 1 | 0 |
| వాసంతిక, చెంచులక్ష్మి | 0 | 12 |
| ప్రతిజ్ఞా పాండవము | 0 | 12 |
| ప్రతిజ్ఞాయాదవము | 0 | 12 |
| గర్వభంగము | 0 | 10 |
| శ్రీకృష్ణ విలాసము | 0 | 12 |

## ఆంధ్ర నాటకములు.

అయినాపురపు సోమేశ్వర రావుగారిచే రచియింపఁ బడినవి.

| | | |
|---|---|---|
| సంగీతసావిత్రి | 1 | 0 |
| సంగీత శశిరేఖ | 0 | 12 |
| సంపూర్ణ రామాయణం | 1 | 0 |
| ప్రహ్లాద (భక్తిరసం) | 1 | 0 |
| నవరత్న చింతామణి | 1 | 0 |
| విచిత్ర చిత్రమాల | 0 | 12 |
| ప్రమదా మనోహరం | 0 | 10 |
| సతీఅనసూయ | 0 | 12 |

అవసరాల శేషగిరి రావుగారివి.

| | | |
|---|---|---|
| లంకాదహనము | 0 | 8 |
| మోహినీ రుక్మాంగద | 0 | 12 |
| రాణీసంయుక్త | 0 | 8 |
| సంగీత చంద్రకాంత | 0 | 12 |
| భీష్మప్రతిజ్ఞ | 0 | 12 |
| రసపుత్రవిజయం | 0 | 8 |
| సుందర పతనముక॥ కృ॥ | 0 | 12 |

కొడాలి సత్యనారాయణరావు గారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| సంపూర్ణాంజనేయము | 1 | 0 |
| భక్తకబీర్ | 1 | 0 |
| సురానంద (కల్లుముంత) | 1 | 0 |
| మధుసేవ (డ్రింకింగ్) | 0 | 12 |
| తులసీదాసు | 1 | 0 |

దొరకు స్థలము:—

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.